# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 69 సంచిక: 43
28-10-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# ప్రహసనమైపోయిన పిసిసి నియామకం

పి సి సి అధ్యక్ష నియామకంవ్యవహారం వ్యవహారంగా మారిపోయింది. అయితే ఈ గంట, కాకుంటే మైగంట అని చెప్తూనే వున్నారు. గంటలు, నిముషాలు, రోజులు వారాలు గడిచిపోతూనేవున్నాయి.

వెంగళరావు రాజీనామా ఆమోదించింది గత శుక్రవారం. ఆ సాయంత్రమే కొత్త

**హైదరాబాదు వృత్తాంతం**

పేరు ప్రకటిస్తారని చెప్పారు. హైదరాబాదునుంచి పిసిసి పదపీఠం పొందుగోరే వారందర్నీ వున్నపాటున ఢిల్లీ రమ్మని పిల్చారు. తమకు గిట్టని వారు ఎక్కడ పదవికొట్టేస్తారోననే భయంతో కొంతమంది పిలవకుండానే పరుగెత్తారు. ఢిల్లీవరకుపోయే ఓపికలేని మరికొందరు నిస్తంత్రీ సందేశాల కుంభవృష్టి కురిపించారు. అనుకూలంగా, అననుకూలంగా కూడా వందలసంఖ్యలో వచ్చిపడిన టెలిగ్రామ్‌లను అందుకోలేక ఢిల్లీ కార్యాలయ గుమాస్తాలు పాపం హైరానాపడిపోయారు. తమవారికి పదవి ఇవ్వమని రాయబారాలు చేసేవారు, ఇవ్వవద్దని రాయబారాలు చేసేవారితో ఢిల్లీవీధులు కళకళలాడాయి.

ఇంకొకప్రక్క గులాంనబీ ఆజాద్ నుంచి ఒకటికి మూడుసాయంత్రాలు పిసిసి పేరుచెప్తాం రమ్మని పత్రికలకు ఆహ్వానాలు వెళ్ళాయి. వచ్చిన విలేఖరులను ఇదిగో పోటాకాల్ రావాలి; ఆ వెంటనే పేరు చెవిలో ఊదేస్తావని గంటలతరబడి నిరీక్షింపజేశారు. హాట్ కాఫీలుతప్ప, హాట్ హాట్ న్యూస్ దొరకకపోవడంతో విలేఖరులు ఉసూరుమనివెనుదిరగవలసివచ్చింది. ఒక్క ఆంధ్రనుంచేకాదు; పశ్చిమబెంగాల్, కర్ణాటక నుంచి వచ్చిన కాంగ్రెస్ వాదులకు కూడా ఇదేపరిస్థితి ఎదురైంది.

పిసిసి నియామకం ఇట్లా నాన్నాపులిచందంగా తయారుకావడానికి కారణమేమిటో ఎవరికి అర్థంకావడంలేదు. వెంగళరావు రాజీనామా ఆమోదించేసరికే కొత్త నాయకుడిపేరు ఖరారైపోయిందని వినికిడి. అయితే దాన్ని బయటపెట్టడానికి ఎందుకాలస్యమన్నదే ప్రశ్న! దీనికి చాలామంది చాలారకాల సమాధానాలు చెప్తున్నారు. ఢిల్లీలోని ఆంధ్ర మంత్రులు, కేంద్రనాయకత్వంపై తమవారికోసం చేస్తున్న వత్తిడులు కారణమని ఒక అభిప్రాయం. అయితే హస్తినాపురాధీశులు ఆంధ్ర నాయకులకు అంత అవకాశం ఇవ్వలేదని కొందరు గట్టిగా చెప్తారు.

పి వి నరసింహారావు, శివశంకర్, వెంగళరావులను ఇప్పటివరకు ఏ కేంద్ర నాయకుడూ అభిప్రాయాలు కోరలేదట. తమమాట విన్పించే అవకాశం సైతం వారికి కల్గలేదని అంటున్నారు. అయితే పి వి తరపున రోశయ్య, శివశంకర్‌తో జగన్నాధరావు, వెంగళరావువెంట ద్రోణంరాజు పేర్లు విన్పిస్తున్నాయి. వీరు ముగ్గురూ గతవారం రోజులుగా ప్రధానిని కలవలేదు; ఆంధ్ర పరిశీలకుడు శ్రీ జగన్నాధ పహాడియాకూడా వీరితో సంభాషించలేదట.

రాజీవ్‌గాంధి పిసిసి పేరు చెప్పడానికి ఒకరోజు పహాడియాను పిల్చారని, అయితే ఈయనపోవడంఆలస్యమయ్యేసరికి ఆయన గది తలుపులు మూసుకపోయాయని తెలుస్తోంది. ఆ వెంటనే ప్రధాని మద్రాసు పర్యటనకు వెళ్లారు. అక్కడకు పహాడియాను పిలిపించారట. కాని తమిళనాడు ప్రజలు తనపట్ల చూపిన ఆదరణ, తన సభలకు ఆవేశంగా తరలివచ్చిన జనవాహినులను చూసిన రాజీవ్‌గాంధీ తబ్బిబ్బుపడిపోయి ఉదయం ఆరు గంటలనుంచి రాత్రి రెండుగంటలవరకు విరామం లేకుండా తిరిగాడట. దాని ఫలితంగా జగన్నాథ పహాడియా ఆయనను కలుసుకొనడానికి క్షణం వ్యవధి సంపాదించలేకపోయాడట.

> **కొత్త అధ్యక్షుని నియామకం ఏరోజుకారోజు వాయిదా పడుతూవుంది; కాలయాపన జరిగేకొద్దీ ఢిల్లీపై వత్తిళ్లు పెరుగుతున్నాయి; ప్రజలలో చులకనభావ మేర్పడుతూంది!**

ఢిల్లీకి తిరిగి రాగానే రైతుల ధర్నాతో రాజీవ్‌గాంధీ పూర్తిసమయంసరిపోతున్నది. రేపు 31 తేది ఇందిరాగాంధి వర్ధంతి చేయతలపెట్టిన బోట్‌క్లబ్ మైదానాన్ని వేలాది

—కొనసాగింపు 7వ పేజీలో

# ఎవరికిఎవరూనాయకులుకారు-ఎవరికిఎవరూ అనుచరులుకారు!

జిల్లా తెలుగుదేశంలో మూడవ ముఠా పుట్టుకొచ్చింది. పుట్టకముందే గిట్టిందని ఒక దినపత్రికలో చాలా ప్రముఖంగా వార్త వచ్చింది. ఈకొత్తముఠా ఎన్నియో యుద్ధముల నారితేరిన వృద్ధయోధుడు శ్రీ ధనేంకుల నరసింహం ఆధ్వర్యంలో ప్రారంభమైందట! ఈ ముదిమి వయసులో తనకు ఇదేమిటనే కీచులాటలని వెంటనే ఆయన ఖండించారు.

ఇక్కడ అసలు ప్రశ్న-జిల్లా తెలుగుదేశంలోని ముఠాల సంఖ్య రెండేనా అని! మూడవ ముఠా పుట్టుకొచ్చిందని వ్రాశారు కాబట్టి ఆ విలేఖరికి రెండు ముఠాలు కన్పడి వుండాలి. అవేమిటో అందులో వివరాలు లేదు. కానీ మాకు మాత్రం జిల్లా తెలుగుదేశం ముఠాలు రెండుగా కన్పడటంలేదు. రెండు పదులైనా వుంటాయన్పిస్తోంది. ముఠాలు రెండయితే-నాయకులూ ఇద్దరుండాలి! కనీసం రెండు వర్గాలైనా వుండాలి. శ్రీనివాసులురెడ్డి మంత్రిగా వున్నప్పుడైతే నల్లపరెడ్డి, ఆనం వర్గాలని విన్పడుతుండేవి! మరి ఇప్పుడో-దేగా నారసింహారెడ్డి, యల్లసిరి శ్రీనివాసులురెడ్డి, రమేష్‌రెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి, బెజవాడ పాపిరెడ్డి, నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, కొండపనాయుడు, డాక్టర్ ప్రభాకర నాయుడు, ధనేంకుల నరసింహం, బల్లి దుర్గాప్రసాద్, ఈదూరు రామకృష్ణారెడ్డి, కాయి కృష్ణయాచేంద్ర...వీళ్ళలో ఎవరికి ఎవరు నాయకులు? ఎవరికి ఎవరు అనుచరులు? ఎవరు ఎవరి ముఠాలో సభ్యులు? ఎవరు ఎవరికి బాధ్యులు? ఎవరు ఎవరు చెప్పినమాట వింటారు? ఎవరు ఎవర్ని అనుసరించిపోతారో చెప్పమనండి చూద్దాం ఎవరినైనా?

> జిల్లా తెలుగు దేశంలో
> ముఠాల సంఖ్య
> మూడు కాదు-
> ముప్పయ్!

వీళ్ళేకాదు, ద్వితీయ శ్రేణిలో సంగం కృష్ణారెడ్డి, వెంకటగిరి శెట్టి, కావలి విజయ భాస్కర్, ఆత్మకూరు కృష్ణారెడ్డి, గూడూరు విజయమోహన్, సూళ్ళూరుపేట మునిరెడ్డి వగైరా వగైరాలంతా ఎవరు నాయకులు? ఎవరివర్గానికి దాసులు?

జిల్లాలోని ఏ నాయకుడికీ పార్టీలోని ఫలానిసభ్యుడు, ఫలాని మండలాధ్యక్షుడు, అదనువశం ఫలానివార్డు కౌన్సిలరు తను చెప్పినమాట వింటారన్న నమ్మకంలేదు. వార్డు కౌన్సిలర్‌కు, పురి ప్రెసిడెంట్‌కు, యువత కార్యకర్తకు, మహిళా సంఘం సభ్యురాలికీ... అందరికీ హైదరాబాదు పైనే కన్ను. వారానికో, నెలకో రాజధానికి లెక్కడం, ముఖ్యమంత్రినో ముద్దు అల్లుడినో, లేకపోతే వారి ఇంటి నౌకరునో కలవడం ఫ్యాషనైపోయింది.

హైదరాబాదు నాయకులకు కావలసింది అదే! జిల్లాలో ఒక నాయకుడ్ని తయారు చేస్తే, వాడు ఆ తర్వాత కొరివై కూర్చుంటాడని వారిభయం. అందువల్లే హైదరాబాదుకు వచ్చేవారినెవరినీ వారు కాదనరు; కాళ్ళకు సాగిలబడి మొక్కుతుంటే వద్దనరు; వచ్చిన ప్రతివాడూ ప్రక్కవాడిమీద ఎన్నిచాడీలు చెప్పినా సగించినట్లు వింటారేతప్ప, వారించరు. జిల్లాపార్టీ ఎంత అనైక్యంగా వుంటే వారికంత ఇష్టం. వీళ్లలో వీళ్ళు తన్నుకచస్తున్నంతకాలం వీళ్ళలో ఎవరూ వ్యక్తిగతంగా నిలదొక్కుకోరని; తమను సవాల్‌చేసే స్థితికి, కనీసం పదవులలో కోటాలడిగే స్థితికి ఎదగరని. ఎదగకూడదని అధిష్టానవర్గం ఉద్దేశ్యం.

జిల్లా గ్రంథాలయ సంస్థ, స్పిన్నింగ్ మిల్లు వంటి పదవులకు గండిపేటనుంచి నేరుగా నియామక ఉత్తర్వులు వచ్చినా; పార్టీ కార్యదర్శిత్వం వంటివాటికి సీల్డు కవర్లు వచ్చినా జిల్లాలో ఒక్కరూ నోరెత్తి మాట్లాడలేకపోయారంటే అందుకు కారణం జిల్లాలో ఏ వ్యక్తిని, ముఠాను అధిష్టానవర్గం గుర్తించకపోవడమే! అదే నల్లపరెడ్డి పార్టీలో వున్నంతకాలం ఆయన్నడగకుండా ఇటువంటి నియామకాలు చేసే సాహసం ఎన్టీఆర్ తలపెట్టేవాడా?

ఇప్పుడు ధనేంకుల నరసింహంగారు 'మూడవముఠా' కూడగట్టడానికి చేసిన యత్నం ఆయన స్వంతం అనుకోవడం పొరపాటు. ఎన్టీఆర్, కనీసం చంద్రబాబు ఆశీర్వాదం లేకుండా ఆయనందుకు ధైర్యం చేయడు; చేయలేడు. నిజానికి నరసింహంగారికి లైబ్రరీ ఛైర్మన్ పదవివ్వగ మందే వయస్సుడిగిందదే అలుసుతో గుహలోని సింహానికి పచ్చగడ్డి వేయబోవడంతప్ప

—తరువ 8వ పేజీలో



## పినాకిని తీరం

**శవ జాగరణ!**

శవజాగారం మానసికంగా, శారీరకంగా ఎంత బాధాకరమైనది, దుర్భరమైనది పెక్కుమందికి అనుభవముంటుంది. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షతకు సంబంధించి అనిర్ణయతో రజీ, నాన్పుడు వ్యవహారం చూస్తుంటే శవ జాగరణ గుర్తుకు వస్తున్నది. రెండిటికీ పోమ్యం లేకపోవచ్చు; సంబంధం లేకపోవచ్చు; ఆ పదవి నిఆశించేవారికి, వారి మద్దతుదార్లకు, అభిమానకోటికి నిరీక్షణ శవజాగరణతో సమానమనే నా అభిప్రాయం.

కీర్తిశేషులు ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రిని శ్రీమతి విజయలక్ష్మిపండిట్ అనిర్ణయబంధీ అని విమర్శించింది. ఏ విషయంలోనూ సకాలంలో సరైన నిర్ణయం తీసుకోలేని రాజీవ్‌గాంధీకి ఆ వ్యాఖ్య వర్తించదా అనిపిస్తుంది పిసిసి అధ్యక్షుడ్ని మార్చాలని నిర్ణయం తీసుకొని ఎంతకాలమైంది? ఒకవ్యక్తికి రెండుపదవులు వుండకూడదని కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ తీర్మానించి ఎన్నినెలలైంది? అతీర్మానం వెలువడిన మరుక్షణంలో అధ్యక్షపదవికి శ్రీ జెంగళరావు రాజీనామా సమర్పించుకొని ఎన్నిమాసాలైంది? పహాడియాలు, పటేల్లు, మూపనార్లు, గులాంనబీ ఆజాద్ వంటి నాయకులు ప్రత్యామ్నాయపుఅభ్యర్థి పరిశీలనకోసం హైదరాబాదుకువచ్చి అభిప్రాయాలు సేకరించుకొనిపోయి ఎన్నిరోజులు గడచిపోలేదు? అధ్యక్షుడుగా ఫలానివాడు నిర్ణయింపబడబోతున్నాడంటే, ఫలానివాడు కాబోతున్నాడని ఎన్నిసార్లు పత్రికలలో వూహాగానాలు జరగలేదు? ఈ చిన్నపదవికి వ్యక్తిని ఎన్నడానికి ఇంత విలంబనంరగాల్నా? ఇన్ని రాయబారాలకు, ఇన్ని వివాదాలకు, ఇన్ని వూహాగానాలకు అవకాశమివ్వాల్నా? గోడతోపొయ్యే పనిని గొడ్డలితో తెచ్చుకోవాల్నా?

ఇటువంటి విషయాల్లో రాజకీయ పరిణతివున్న మహానాయకుడేకాదు, మామూలు నాయకుడుకూడా ఈవిధంగా వ్యవహరించరు. రాజకీయాల్లో, అందులో పదవులకు సంబంధించి నిర్ణయానికి ప్రకటనకు మధ్య క్షణంకూడా వ్యవధి వుండకూడదు. ఆలోచనలు వూహాలరూపంలో బయటకు వచ్చి నిర్ణయప్రకటనకు ఒక్కపూట అలస్యమైనా ఒత్తిడిలు తట్టుకోలేరు; మరలా ఆ నిర్ణయానికి రావడానికి బ్రహ్మప్రళయమైపోతుంది. రాజకీయాలలో ప్రాథమిక సూత్రం ఇది. ప్రధాని రాజీవ్ గాంధీ రాజకీయవాదికాదు అవడానికి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష నిర్ణయంలో ఆయన తేనెతుట్టె కదిలించి తేనెటీగలు ముట్టడినుండి బయటపడలేక తికమకపడడమే ఇందుకు నిదర్శనం.

ఈ విషయంలో ఇందిరాగాంధీతో ఎవరూ సమానులుకాదు. ఆమె ఒక నిర్ణయానికి వచ్చిందంటే ఇక దానికి తిరుగులేదు. ఆకాశం మీదబడ్డా, భూమి బద్దలైనా తానను కున్నది ఆమె అమలు జరిపితీరేది. ఆమె మనసులోమాట నరమానవుడికి తెలిసేదికాదు; నిర్ణయ ప్రకటనచూచి అందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోవలసివచ్చేదేగాని ముందు తెలిసేదికాదు. సంశయాత్మకు ఆమెలో చోటేలేదు. నమ్ముకున్నవాడ్ని హింసపెట్టేదికాదు. అటువంటి వ్యక్తిమనిషే మన రాష్ట్రానికి సంబంధించి ఒకసారి ఒత్తిడులకు, పరిస్థితుల ప్రాబల్యానికి తలవగ్గిపోవలసివచ్చింది. అటువంటిది రాజీవ్‌గాంధీ ఒక చిన్నసమస్యను అనవసరంగా నానబెడితే తట్టుకోగలడా? సరైన నిర్ణయానికి రాగలడా?

వెంగళరావుగారి రాజీనామా ఎప్పుడు ఆమోదించారో, దానితోబాటే అక్షణంలోనే కొత్త అధ్యక్షుని ప్రకటనకూడా జరిగిపోయివుంటే ఆసమస్య అంతటితో ముగిసిపోయివుండేది. ఆ నిర్ణయం ఎవరికి సరిపడినా, ఎవరికి సరిపడకపోయినా అందరూ ఒప్పినట్లు ఆ నియామకాన్ని అంగీకరించివుండేవారు; అందరూ సహకరించివుండేవారు, రాష్ట్రంలో కాంగ్రెస్ వాది అన్నవాడికి అంతకంటే గత్యంతరంలేదు. కాంగ్రెస్ అగ్రనాయకత్వానికి

—తరువ 10వ పేజీలో

# జమీన్‌రైతు

## ఆంధ్ర పత్రిక

మొట్టమొదటి తెలుగు దినపత్రిక ఆంధ్రపత్రిక; తెలుగువారికి వారిభాషలో వార్తలందించాలనే మహదాశయంతో ప్రారంభింపబడిన ఆంధ్రపత్రిక; స్వాతంత్ర్యపోరాటానికి ఆంధ్రదేశంలో అలంబనంగా నిలచిన ఆంధ్రపత్రిక; దేశభక్తి,త్యాగనిరతికి, ఔదార్యగరిమకు మహ పీయుడు,ఆంధ్ర రాయలసీమ సమైక్యతకు సౌహార్ద సేతువుగా 'శ్రీబాగ్' ఒప్పందాన్ని సాధించిన చారిత్రక పురుషుడైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిచేత స్థాపించబడిన ఆంధ్రపత్రిక- పర హస్తగతమవుతున్నదని తెలిసినప్పుడు పరితపించని తెలుగుహృదయం వుండదు.

'ఆంధ్రపత్రిక' మూడుతరాలపాటు దేశోద్ధారకుని దారిలోనే నడచింది; ఆయన నిర్దేశించిన మార్గంలోనే పయనించింది; అ ఖ రు కు వారి ప్రాంగణం దాటిపోతున్నది, అవిభాజ్యంగా వుండిన అమృతాంజనంతో విడబాటు పొందుతున్నది. బొంబయిలో 1908 లో వార పత్రికగా ప్రారంభమైన ఆంధ్రపత్రిక, 1914లో మద్రాసుకు మార్చబడి దినపత్రికగాకూడా వెలువడుతున్నది. మొదటి ఇరవైనాలుగు సంవత్సరాలు నాగేశ్వరరావు పంతులుగారే దీని సంపాదకులు; ఆయన దివంగతులైనతర్వాత 1938 నుండి 1972 వరకు ఆయన అల్లుడు కీర్తిశేషుడు శివలెంక శంభుప్రసాద్ దాని సంపాదకత్వం నెరపి నిర్వహించారు; ఆయన తదనంతరం ఆయన తనయుడు శ్రీ రాధాకృష్ణ నేటివరకు సంపాదకులుగా వుంటున్నారు. వార, దినపత్రికలు, భారతి మాసపత్రిక కాక; ఇటీవలికాలంలో 'బాలరంజని' పిల్లలపత్రిక, 'సినిమారంజని' సినిమా పత్రికలుకూడా ఆ సంస్థనుండి వెలువడుతున్నాయి. వాటన్నిటిని ఒక్కసారిగా దేశోద్ధారకుని కుటుంబం వదలుకొన్నది; కర్నూలు పారిశ్రామికవేత్త శ్రీ టి. జి. వెంకటేష్ దాని కొత్తయజమాని అయ్యారట.

ఆంధ్రపత్రిక వ్యాపారదృష్టితో ప్రారంభించబడిందికాదు; లాభాపేక్షతో నడపబడిందికాదు; కేవలం తెలుగుప్రజల సేవ, తెలుగు ప్రజల ప్రత్యేకరాష్ట్రం, దేశస్వాతంత్ర్య పవిత్రాశయాలతో, నిస్వార్థంగా నడుపబడిన పత్రిక ఆంధ్రపత్రిక. నష్టంవస్తున్నా అమృతాంజనం లాభాలతో దాన్ని పూడ్చుకుంటూ డెబ్బయ్‌ఐదేళ్ళపాటు సేవ జేసిన పత్రిక ఆంధ్రపత్రిక. ఆంధ్రుల భాషాకళాసాంస్కృతిక రాజకీయ చైతన్యానికి అద్దంపడుతూ, ఆంధ్ర జనజీవితంలో పెనవేసుకొని పోయిన పత్రిక ఆంధ్రపత్రిక. 1987 లో 'ఆంధ్రప్రభ' ప్రారంభమయ్యేవరకు ఏకాకిగా తెలుగువారికి అమూల్యంగా సేవజేసిన పత్రిక ఆంధ్రపత్రిక. పాతవిలువలు, పాతసాంప్రదాయాలు వదలలేక, కొత్తవేషాలు వేయలేక, కాలంతో అడుగుకలపలేక వెనుకబడి, నష్టాల వూబిలో దిగబడి చివరకు పరహస్తం కాకతప్పని దురదృష్టకరస్థితికి చేరుకున్న పత్రిక ఆంధ్రపత్రిక.

'ఆంధ్రపత్రిక' అదృశ్యంకాకపోవచ్చు; నూతన జవసత్వాలు పుంజుకొని కాలానుగుణమైన మార్పులతో మరింత ఆకర్షణీయంగా, ఆదరణీయంగా వెలువడవచ్చు. కాని అది వాణిజ్యపరంగా వెలువడే కొత్త ఆంధ్రపత్రిక అవుతుందిగాని, తెలుగుప్రజలకు అంకితభావంతో నిస్వార్థంగా సేవజేసిన పాత ఆంధ్రపత్రిక మాత్రం కాబోదు. ఆంధ్రపత్రిక యాజమాన్యం మార్పు ఒక నగ్నసత్యాన్ని చాటుతుంది- కోట్లరూపాయల పెట్టుబడితో; వున్నతాశయాలు, వుత్తమాభిరుచుల వెంట ప్రజలను నడిపించడంకాకుండా, ప్రజల అభిరుచులకు అనుగుణంగా కాముపరుగిడుతూ ఏగాలికాదాప ఎత్తగలిగి, ఏరోటివద్ద ఆపాట పాడగలిగిన పత్రికలకుతప్ప ఇతర పత్రికలకు పుట్టగతులు లేవని చాటుతుంది.

ఆంధ్రపత్రిక కేవలం ఒక పత్రికకాదు; అదొక సంస్థ, వుద్యమం, ఒకప్పుడు ఆంధ్రులకు వూపిరి. అటువంటి వుజ్జ్వల చరిత్ర గలిగిన 'ఆంధ్రపత్రిక' పరహస్తం కావడం ప్రతి ఆంధ్రుడికి మనస్తాపాన్ని కల్గించితీరుతుంది!

---

## జమీన్‌రైతు

28-10-1938
20 పేజీలు అణా

### వర్షాగమనం

రైవల్లులు శ్రీ మొదలి రామకృష్ణ సిద్ధాన్తిగారు వ్రాసినట్లు వర్షం 26 తేది ప్రారంభమయి శోభీపాతంగా కురుస్తున్నది. ఏదిదివరకిల్లే మా కోర్కపై పలువర్యాయాలు వ్రాసినప్పుడంతా తప్పకుండా ఆ ప్రకారం వర్షం కురిసి తీరింది. దీన్నిబట్టి జ్యోతిష్యం అబద్ధం గాదనీ జ్యోతిష్యంలో ఆ శేదాపుందని తేలుతున్నది.

### జమీందారీ విచారణ రిపోర్టు

జమీందారీ విచారణను గూర్చి పల్లెల్లో వ్యాపించే వదంతులన్నీ అసత్యం. రిపోర్టు నవంబరు 29 తేది శాసనసభ నాటికి వస్తుంది. కొంచెం ఆలస్యమేగాని ఇప్పటిలేమీ అమృతం ఒలికిపోలేదు.

### నెల్లూరుముచ్చట్లు

(విమర్శకుడు)

**జిల్లాబోర్డు**

1 తేది 11 గంటలకు కలెక్టరుగారు ఛార్జి తీసుకొని పదవుల్ని ఇరవులకు చెరిగేటు వేస్తారట.

నవంబరు 22 తేది 11 గంటలకు ప్రెసిడెంటు ఎలక్షన్ జరుగుతుంది.

* * *

అక్టోబరు 30 తేది ఆదివారంనాడు రెండు బోర్డుల మీటింగులు నిర్ణయించి యున్నారు.

* * *

ప్రెసిడెంటు పదవికి పోటీచేయను ప్రోత్సహించే వాళ్ళు వలుగుడున్నట్లు

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

తోస్తుంది. వెంచయ్యనాయుడుతో సహా రాష్ట్రీ సంఘంవారు దరఖాస్తుదార్లను పిలవకపోయినా కళ్యాణరావుగారు దరఖాస్తు వేశారు. టాక్సీకాడులో ఓడుగంటి వెంకటసుబ్బయ్య, వేమూరు లక్ష్మయ్య, కళ్యాణరావుగార్లు ఉత్తరబోర్డు మెంబర్ల వద్దకు క్యాన్వాసింగుకు బైల్దేరారట.

వెంచయ్యనాయుడుగారు కనిగిరిలో మకాం వేసి ఆదినారాయణశెట్టిగార్ని యిరర్లనుపిలిపించి రహస్యసంభాషణలు జరిపారట. దర్శి దివిజా పోతవరం వెళ్ళి గురప్పనాయుడుగారి చెవుగొరికి వచ్చారట. దీనిపేరు క్యాన్వాసింగ్ కాదంటాడు వెంచయ్యనాయుడుగాడు.

### కొండ్లపూడి ఆదిశేషారెడ్డి విచిత్ర దావాలు

పట్టా టాక్సుపదు కోరకున్నా వాడి పాక్కు అనుభవాలతో ప్రవేశం లేకుండుటకున్నూ కలెక్టరు వగైరా 40 మందిమీద నె. డి. ము. కోర్టులో O. S. 9/37 వ కొండ్లపూడి ఆదిశేషారెడ్డి వల్ల దావా దాఖలై 31.1.38 వాదిపక్షా డిక్రీకాబడినది.

సదరు డిక్రీని ఉల్లంఘించి కలెక్టరు వాడ మరొక సోము ఓబయ్య తాలూకా పాపరు స్టాంపుడ్యూటీకాకి సదరుడిక్రీలోని 27వ అయిటమును జప్తి వగైరా చర్యలు జరిపినందుకు వాది కలెక్టరుకు వ్రాస్తే సరియైన సమాధానం రాలేదని C. P. C. ఆర్డరు 21 రూలు 32 క్రింద కలెక్టరుగారిమీద వారంటు దరఖాస్తు దాఖలుకాబడి 14-10-38 తేదీన హియరింగు జరిగింది. జడ్జిమెంటు నిల్వలో ఉంది.

(C P. C. ఆర్డరు 21 రూలు 32 యొక్క అభిప్రాయం అట్లు డిక్రీని ఉల్లంఘించినవారిని అరెస్టుచేసి, సివిలు జైలులోపెట్టి వారిఆస్తి జప్తి చేయమని.)

ఆదిశేషారెడ్డిగారికి వకీలులేడు. తానే స్వయంగా నడుపుకుంటాడు.

---

# మహాభారతాని కెందుకింత ప్రాధాన్యత?

ప్రజాస్వామ్య విలువలు, సాంప్రదాయాల పరిరక్షణ; లౌకిక తత్వం పరిపోషణలో భారతీయ దినపత్రికలు ప్రపంచ స్థాయి గుర్తింపు పొందాయి. భిన్నమతాలు, భిన్నకులాలు, భిన్నజాతుల సమ్మేళనమైన భారతదేశంలో సెక్యులర్ వాతావరణం సృష్టించడానికి దినపత్రికలు చేసినకృషి, సేవ అపారమైనది.

అటువంటి దినపత్రికల సర్కులేషన్ పెంపు అనే ఏకసూత్ర కార్యక్రమంతో వ్యాపారదృష్టితో ఇటీవలకాలంలో పెడమార్గం పడుతున్నాయా, అడ్డుదార్లు తొక్కుతున్నాయా అన్పిస్తుంది. టి. వి. లో వస్తున్న మహాభారతం సీరియల్‌కు దినపత్రికలిస్తున్న ప్రాధాన్యత; దసరా, వినాయకచవితి, దీపావళివంటి పండుగల సందర్భంగా వెలువరిస్తున్న ప్రత్యేకసంచికలోని వ్యాసాలు ఈ సందేహానికి ఆస్కారంకల్పిస్తున్నాయి.

టివిలో నిత్యం ఎన్నో సీరియల్స్ వస్తుంటాయి. వాటన్నిటినీ వద్దించుకొని దినపత్రికలు మహాభారతం కథను ముందుగా ప్రచురించడానికి ఎందుకు పోటీ పడుతున్నాయి? అకథను ఇవ్వడం పత్రికకు, పాఠకులకు అవసరమా? పత్రికల ద్వారా దాని ప్రాధాన్యతను అంతగా పెంచవలసిన అవసరంవుందా? రామాయణం సీరియల్ ఉత్తర భారతదేశంలో ఎంతగా మతతత్వాన్ని ప్రేరేపించిందీ మనకు తెలుసు. మహాభారతంద్వారా దాన్ని మళ్ళీ పునరావృతం చేయడానికి పత్రికలు కంకణం కట్టుకున్నట్లు ప్రవర్తిస్తున్నాయి. పాఠకులు చదువుతున్నారన్న కారణంతో మతారాధనను, మూఢవిశ్వాసాలను పెంపొందింపజేయడం మంచిదికాదు. తెలుగు దినపత్రికలతోపాటుగా ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌వంటి జాతీయ పత్రికలుకూడా ఈకక్కుర్తిపాల్పడుతున్నాయంటేవీనను కోవాలి? మన పత్రికారంగాన్ని వ్యాపార సూత్రాలు, లక్ష్యాలు ఎంతగానో ప్రభావితం చేస్తున్నాయనుకోవాలి!

నెల్లూరు —ఆర్. వి. రాజు.

### సుబ్బరామరెడ్డిగారూ నెల్లూరు మరవకండి!

ఈమధ్య న్యూఢిల్లీలో జరిగిన 'తెలుగు ఫిలిం ఫెస్టివల్' ముగింపురోజున ముఖ్య




అతిథిగా విచ్చేసిన శ్రీ తిక్కవరపు సుబ్బరామరెడ్డి ఆంధ్రా ఫిల్మ్ సొసైటీకి తాను సకలవిధాల సహాయం చేస్తానని అడగకుండానే వరాలు ప్రసాదించారు. అంతేకాదు- పార్లమెంటు భవనంగ్గర ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు విగ్రహ ప్రతిష్ఠాపనకు అయ్యేఖర్చు భరిస్తాననికూడా హామీఇచ్చారు. ఇంతటిగొప్పదాత అయిన శ్రీసుబ్బరామరెడ్డి నెల్లూరీయుడైవుండికూడా నెల్లూరుపట్టణంమీద దయకల్గకపోవడం నెల్లూరీయుల దురదృష్టం. కనీసం ఇకనైనా శ్రీ సుబ్బరామరెడ్డిని నెల్లూరు పురప్రముఖులు ఉపయోగించుకుని నెల్లూరు అభివృద్ధికి తోడ్పడేటట్లు చేయగలరని నా ప్రగాఢ ఆకాంక్ష.

న్యూఢిల్లీ -సునీల్‌బాబు

★

పంచముడని కించపరచినవారిపై కవితా విస్ఫులింగాలు కురిపించిన మహాకవి, సాహితీ తపస్వి

# గుర్రం జాషువా

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ., బి.ఇడి.

మహాకవి, కళాప్రపూర్ణ, పద్మభూషణ్ గుర్రం జాషువా 6 దశాబ్దాలపాటు తెలుగు భాషాసేవ చేసిన మహనీయుడు. 36 కు పైగా కావ్యాలను ఖండకావ్యాలను రచించారు. సమసమాజస్థాపన, అస్పృశ్యతా నిర్మూలన, దేశభక్తి, సాంఘిక దుర్నీతుల తొలగింపు, మానవతావాదం, మూఢవిశ్వాస నిర్మూలనను కవితావస్తువులుగ స్వీకరించారు.

1895 సెప్టెంబరు 28 తేదీన వీరయ్య లింగమాంబ దంపతులకు కలిగిన జ్యేష్ఠ పుత్రుడీయన. చిన్నప్పుడు వినుకొండలో బడిలో చేరాడు. ఊరిముఖ్యుని దారిలో పోతుండే సవర్ణులానికి చెందిన బాలాకరు జాషువాను దూరంగా తొలగిపొమ్మంటే, ఆ పిల్లవాడినికొట్టి అతడి తల్లికి నివేదించాడు. "దెబ్బకొట్టింది మీవాడిలోని కుంకత్వాన్నిగాని మీవాడినిగాదు" అని! ఆ విధంగా బాల్యం నుంచే ఆయనలో పంచమ జాతి వారిని సరిగా చూడటంలేదనే అసంతృప్తి బహిర్గతమౌతూవచ్చింది. తల్లిదండ్రులు చెప్పిన పలనాటి కథలు, పాడిన గొల్లసుద్దులు జాషువాలో కవిత్వానికి చిన్నతనంలోనే పునాదులువేశాయి. 5వ తరగతి పాసైన తర్వాత వినుకొండలో ఉపాధ్యాయుడుగ ఉద్యోగమిచ్చారు. తిరుపతి వేంకటకవులు కొప్పరపు కవుల కవితా యుద్ధాలను చూసి కవిత్వంపై మక్కువ పెంచుకున్నారు. జాపూడి హనుమచ్ఛాస్త్రి గారిని ఆశ్రయించి కవిత్వాన్ని వ్రాయడం నేర్చుకొన్నారు. తనపడిన కవితోనల్లా స్నేహంచేశాడు. కాని వ్రాసిన కవిత్వాన్ని మెచ్చుకొన్నవారేలేరు. క్రైస్తవమత దురభిమానులవల్ల ఉద్యోగం ఊడటంతో ఒక టూరింగ్ టాకీసులో 15 రూపాయలకు ఉద్యోగానికి చేరాడు. రాజమండ్రిలో చేసే యీఉద్యోగమూ పోవడంతో ఎనిమిదిన్నర రూపాయల వేతనంతో మళ్ళీ ఉపాధ్యాయుడుగ చేరాడు. చాలీచాలని జీతంతో ఒక పూటతిని, ఒకేగుడ్డకట్టి రోజులు గడిపేవాడు. మిలిటరీలో చేరి ఆర్థికయిబ్బందులను తొలగించుకోదామని రిక్రూటింగ్ ఆఫీసుకు వెళ్తే ప్రపంచయుద్ధం అయిపోయింది పొమ్మన్నారు. రాజమండ్రిలో తోలేటి సుబ్బారావుగారితో పరిచయమైంది; అనేక సాయంత్రాలు వారిద్దరు గోదావరి గట్టున కూర్చుండి సాహిత్యగోష్ఠులు జరిపేవారు. జాషువా యిబ్బందులనుగమనించిన ఆయన సర్కారోలు గున్నేశ్వరరావుతో మాట్లాడి వెలిశెంపీద నాటక రచయితగా ఉద్యోగమిప్పించాడు. అక్కడ రుక్మిణీ కల్యాణం నాటకం వ్రాశాడు. అది మంచిపేరు తెచ్చిపెట్టింది. దీనితో ఆయనకు వీరేశలింగం గారితో పరిచయమయింది. వినుకొండలో జాగర్లమూడి కుప్పుస్వామి జిల్లా బోర్డు ప్రెసిడెంట్ అయిన సందర్భంలో జరిగిన సన్మాన సభలో పద్యాలు చదివి నూటపదహార్లు సన్మానమందుకొన్నాడు. కుప్పుస్వామిగారే జాషువాకు బాపట్లలో తెలుగు పండిత ఉద్యోగమిప్పించారు. క్వాలిఫికేషన్ లేదని తరువాత తీసేస్తే, వార్ పబ్లిసిటీ ఆఫీసరుగాచేరి 1939 నుండి 1945 వరకు ఉద్రేకపూరితమైనగేయాలు, పాటలు వ్రాసి ప్రజలనుర్రూతలూగించారు. తాను వ్రాసిన పాటలు, గేయాలు తానే పాడేందుకు చక్కనిగొంతు ఆయనకు వరప్రసాదమయింది. 1956 నుండి 1960 వరకు ఆకాశవాణిలో పనిచేశారు. అనేక సన్మానాలు, సత్కారాలుపొంది, "ఆంధ్ర కవితా మహారాష్ట్రంలో మకుటంలేని పీష్వా మన జాష్వా" అన్పించుకున్నాడు.

జాషువా జన్మించింది పండిత వంశం కాదు. సంపన్న వంశమూకాదు. యింట్లో పాండిత్యాన్ని గడించడానికి, బయట ఉన్నతవిద్య నార్జించడానికి అవకాశాలు దక్కవు. ఆయన పాండిత్యం ఎక్కువ పాలు స్వయంకృషితో సాధించుకున్నదే. "నేను వ్రాసిన రచనలు వినండి" అని పదిమందితో చెప్పుకొనే సాహసం చేయలేని సాంఘిక పరిస్థితులలో ఆయన మెలిగాడు. అయినప్పటికి ఆత్మవిశ్వాసం అధికంగా వున్నవ్యక్తి. కాబట్టి ఎదురు దెబ్బలకు జంకక కవిత్వాన్ని ఒక తపస్సుగా భావించి సాహితీసేవ చేయగలిగాడు.

కడలేని కాలవాహిని
సుడిగుండములెన్నిగలవో చూచినవాడన్
వడిదుడుకు లేక బ్రతుకున
పడవ నడుపుకొనినవారు వసుంధర గలరే

అని అంటాడు. ఇట్టి కావ్యనౌక కర్ణధారిగా తీరాన్ని చేరుకొని ధన్యుడైనాడు.

హిమధర్మార్క పరిణయం, శివాజీ, నేతాజీ, బాపూజీ, ఫిరదౌసి, స్వప్నకథ, గబ్బిలం, కాందిశీకుడు, కొత్తలోకం, ముంతాజమహల్, రాష్ట్రపూజ, నాగత, స్వయంవరం, అనసూయ, క్రీస్తుచరిత్ర మొదలగు కావ్యాలు; ఏడు సంపుటాల ఖండకావ్యాలు, మీరాబాయి, తెరచాటు, రుక్మిణీ కల్యాణం మొదలగు నాటకాలు ఆయన సాహితీ క్షేత్రంలో పండించిన పలురకాల పంటలు.

జాషువా యుద్ధ ప్రచారకులుగా పని చేసే కాలంలో "వీరరసపూరితమైన నేతాజీ కావ్యం వ్రాయడానికి" ఉద్దీపన లభించింది. ఆయన కథను తొలినిట్టూర్పు,

—కొరవ 11 పేజీలో

# ఆటోనగర్‌కు వర్క్‌షాపులు తరలించడానికి ఇంకెన్ని దశాబ్దాల సమయం కావాలి?

సింహపురి

టౌనునుంచి ఆటోనగర్‌కు వర్క్‌షాపులను తరలించే కార్యక్రమం వినాయకుడి పెళ్ళిలాగా వాయిదాపడుతూనేవుంది. దశాబ్దమై వుంటుంది. ఆటోనగర్ ప్రతిపాదన పరిశీలనకు వచ్చి. స్థలాల సేకరణ, కేటాయింపు జరిగికూడా ఐదారేళ్ళయిపోయింది. అప్పటి నుంచి వర్క్‌షాపుల తరలింపు కార్యక్రమం ఎప్పటికప్పుడు మొదలైనట్లే కన్పిస్తుంది; ఆ వెంటనే నిరవధికంగా వాయిదాపడుతూంది.

నాలుగైదు నెలల క్రితం, కలెక్టర్ ప్రశాంత మహాపాత్ర చాలా పట్టుదలగా మొదలుపెట్టాడీపనిని! వర్క్‌షాపులు, మెకానిక్ అంగళ్ళు, లేతులు, వెల్డింగ్‌షాపులన్నింటికి నోటీసులిచ్చారు. విద్యుత్ కనెక్షన్లు కత్తిరించారు. వారంలోపలే టౌనులో వర్క్‌షాపుల కరకరలు, గరగరలు లేకుండాపోయేట్లు కన్పించింది వాతావరణం.

అంతలోనే ఏమిజరిగిందో- అంత ఊపు నందుకున్న ప్రయత్నం నీళ్ళుచల్లిన పాల పొంగులాగా చప్పుచల్లారిపోయింది. కంటి తుడుపుకుకూడా ఒక్క అంగడీ ఆటోనగర్‌కు తరలలేదు.

ఏళ్ళతరబడి టౌను సెంటర్లలో పని చేసుకుంటున్నవారు రాత్రికిరాత్రి ఊరికి దూరంగా పోవలసివస్తే వడ్డునపడిన చేపలలాగా గిలగిలలాడడం సహజమే! వారి సంపాదనకు అంతరాయం కల్గడమూ సహజమే! అయితే ఈ వర్క్‌షాపుల వల్ల టౌనులో పౌరజీవితానికి, రాకపోకలకు ఎదురౌతున్న ఇబ్బందులుకూడా తీవ్రంగానే వున్నాయి. నడిరోడ్లో ఇనుపగేట్లు పరిచి రాత్రీపగలు తేడాలేకుండా వెల్డింగులు చేస్తుంటే, దారినపోయేవారు కళ్ళు మూసుకొని నడవాల్సినపరిస్థితి ఎదురౌతుంది.

అనిబాపాలుపీధిలో ట్రాక్టర్ రిపేరు షాపులు రోడ్డును ముప్పాతికభాగం ఆక్రమించేశాయి. చంద్రశేఖర్ లాడ్జి ఎదురుగా రిపేరుకు ఆగిన కార్లవరుసలలో నుంచి మామూలు వాహనాలు అతికష్టంగా సందు చేసుకుని పోవలసివస్తూంది. లీలామహల్ ప్రక్కన చాకలిపీధిలో ఇనుపగేట్లు రోడ్లోనే పరిచిపారేస్తున్నారు. నడవడానికి కూడా కష్టంగావుంది.

టౌనులో ప్రతివీధిలోనూ పీడరణగొణ ధ్వనులతో ఇక్కట్లోని వారు పడుతున్న బాధలు అన్నిన్నికావు. వర్క్‌షాపు యజమానులు ఇప్పుడు కాకుంటే ఎప్పుడైనా టౌనుకు దూరంగా పోవడం తప్పనిసరి! అందరూ ఒక సంఘంగా ఏర్పడి, ఒక తేదిని తమకుతామే స్వచ్ఛందంగా నిర్ణయించుకొని, మూకుమ్మడిగా ఆటోనగర్‌కు తరలివెళ్తే, ఎవరి వ్యాపారానికీ ఆటంకం కల్గదు. అధికారులు నయానో, భయానో వారిని ఒప్పించి సాధ్యమైనంత త్వరగా టౌనుకు ఈ బాధ తొలగించడం అవసరం. విద్యుత్‌శాఖ, మునిసిపాలిటీ, పరిశ్రమల కేంద్రం, పోలీసు అధికారులు పరస్పర సహకారంతో పట్టుదలగా పనిచేస్తే ఇది పెద్దపనా?

—కొరవ 8 పేజీలో

# యూరియాను వేపపిండితో కలిపి చల్లితే వరిపైరు దిగుబడి ఎంతో పెరుగుతుంది!

ఎం.రవీంద్రకుమార రెడ్డి
ఎం. ఎస్‌సి (అగ్రి)

రసాయనిక ఎరువులద్వారా నత్రజనిని వరిపైరుకు యూరియా రూపంలో ఎక్కువగా రైతులు వుపయోగిస్తున్నారు. యూరియాలో వుండే నత్రజని పూర్తిగా పైరుకు వుపయోగపడదు. ఇందుకుకారణం యూరియానుంచి నత్రజని చాలాతొందరగా విడుదలకావడమే. అలావిడుదలైన నత్రజని నంతటినీ వరిమొక్క ఒక్కసారిగా తీసుకోలేదు. రసాయనిక ఎరువులు వేయుటలో రైతులు సరియైనపద్ధతులను పాటించనందువల్ల నత్రజని గాలి ద్వారా, నీటి ద్వారా 50 నుంచి 70 శాతం వరకు పైరుకు అందకుండా వృథా అవుతుంది.

యూరియా వరిపైరుకు వాడేటప్పుడు పొలంలో నీరు వుంచకూడదు. యూరియా వేసిన 24-36 గంటల తర్వాత నీరు పెట్టాలి. దీనివల్ల కొంత నత్రజని నష్టపోకుండా కాపాడవచ్చు. నత్రజని ఎరువులైన యూరియా, అమ్మోనియం సల్ఫేటు భూమికి వాడినపుడు నత్రీకరణ అనే రసాయనిక చర్యలవల్ల నైట్రేటులుగా మారుతాయి. ఈ నైట్రేటులు నీటిలో కరగి కొంత పైరుకు వుపయోగపడులాంటు. డీనైట్రిఫికేషన్ అనే రసాయనిక చర్యవల్ల నత్రజని వాయువుగానూ, నైట్రస్ ఆక్సైడ్‌గానూ మారి కొంత వృథాగా గాలిలో కలిసిపోతుంది.

అందువల్ల ఈ నత్రజని భూమిలో నష్టపోకుండా సమర్థవంతంగా వాడుకోవాలి. నత్రజని ఎరువులనుంచి నత్రజని నెమ్మదిగా విడుదలయ్యేటట్లు చేసే పదార్థాలు వేపపిండిలో వున్నాయి. వేపపిండిని వుపయోగించడంవల్ల నెమ్మదిగా కొద్దికొద్దిగా విడుదలయ్యే నత్రజనిని మొక్కలు ఎప్పటికప్పుడు వుపయోగించుకొంటాయి. అందువల్ల నత్రజని వృథాకావడం జరగదు.

వేపగింజల్ని గానుగఆడి నూనె తీసిన తర్వాత వచ్చేపిప్పిని వేపచెక్క అంటారు. ఈ వేపచెక్కను తీసుకుని బాగాదంచి మెత్తగా పొడిచెయ్యాలి. ఇలా మెత్తగా పొడిచేసిన 20 కిలోల వేపపిండిని 100 కిలోల యూరియాలో 1:5 నిష్పత్తిలో బాగా కలిపి రెండురోజులు నిల్వ వుంచాలి. తర్వాత పొలంలో వరిపైరుకుచల్లితే నత్రజని మెల్లగా విడుదలౌతూ మొక్కకు అందిస్తుంది. దీనివల్ల నత్రజని ఏమాత్రం

—కొరవ 11 పేజీలో

# పల్లెటూళ్ళు బందిపోట్ల నెలవులైపోతున్నాయి!

మైపాడు పోయేదారిలో. రాపూరు వెంకట్రల గ్రామాల మధ్య 23 తేది రాత్రి ఒక దోపిడీ జరిగింది. గంగపట్నంకు చెందిన ఇద్దరు యువకులు మోటార్ సైకిల్‌పై వస్తుండివారట. అప్పుడు రాత్రి 10 గంటలుకూడా కాలేదట. ఈ రెండు గ్రామాల మధ్య ఒక నిర్మానుష్య ప్రదేశానికి వచ్చేసరికి ఒక బందిపోట్ల గుంపు వారిని అటకాయించిందట. కాని వారు ఆపలేదు. దానితో ఒక దుర్మార్గుడు కర్రతో కొట్టాడట. అంతే ఇద్దరూ, మోటార్ సైకిల్ పైనుంచి క్రిందపడిపోయారు. వారి మెడలో వున్న దండలు, చేతిగడియారాలు, జేబులోని డబ్బు పెరుక్కుని; ఇద్దర్నీ రోడ్డు ప్రక్కన చెట్టుకు కట్టి వెళ్ళిపోయారట బందిపోట్లు. తర్వాత ఎప్పటో దారినపోయే ఒక ఆటోడ్రైవరు చూసి వారిని బంధవిముక్తులను చేశాడట.

ఆ రేరో జా రాత్రి ఇందుకూరుపేట మండలం కొరుటూరు గ్రామంలో ఒక గిరిజన యువతిని ఎవరో సామూహికంగా మానభంగంచేసి, చంపి, చెరువులో పారేసి పోయారట. ఆ యువతిశవం చూస్తుంటే వళ్ళు జలదరించిందని; వళ్ళంతా పంటి గాట్లు, రక్తపు గాయాలతో చిత్రహింస లనుభవించినట్లుగా వుండిందని తెలుస్తూంది. శవంపైన గుడ్డలేకుండా, నగ్నంగా వుండిందట.

అల్లూరు సింగపేట గ్రామాలమధ్య ఒక యువకుడ్ని ఎవరోహత్యచేసి, శవాన్ని తగలబెట్టడానికి ప్రయత్నించి, విఫలులై పారిపోయారట. ఆ యువకుడెవరో గుర్తు కూడా తెలియడంలేదు. బుచ్చిరెడ్డిపాళెం మండలం మినగల్లుబస్సును 26 తేదిరాత్రి దామరమడుగు దగ్గరనిల్పి, కండక్టర్ చేతిలోని క్యాష్‌బ్యాగ్ పెరుక్కొని పోయారట కొందరు దుండగలు.

చెప్పుకుంటూపోతే ఇటువంటి దారి

## జిల్లావార్తలు

దోపిడీలు, హత్యలు, మానభంగాలు కోకొల్లలుగా కన్పిస్తున్నాయి. ఇవన్నీ పోలీసుల దృష్టికి, పత్రికలదృష్టికి వచ్చినవి. ఎవరికిచెప్పి ఏమి ప్రయోజనమన్న నిస్పృహతో ఎవరికివారు సర్దుకుంటున్న సంఘటనలూ అసంఖ్యాకంగా వుంటున్నాయి.

వీటన్నిటిఫలితంగా పల్లెటూళ్ళలో శాంతిభద్రత కరువైందన్న అసంతృప్తి పెరిగిపోతూంది. చిల్లర దొంగతనమైనా, పెద్ద దోపిడీ అయినా పోలీసులు పట్టుదలగా ప్రయత్నించి, నేరస్తులను పట్టుకొన్న దాఖలాలు లేకపోవడంతో ఇటు ప్రజలలో నిర్లిప్తత పెరిగిపోతూంది; అటు దొంగలు, దోపిడీదారులలో నిబ్బరం హెచ్చుతున్నది.

కొన్నిచోట్ల దొంగలను గ్రామస్తులేపట్టించి ఇచ్చినా పోలీసులు వారినుండి మామూళ్ళు దండుకొని వదిలేస్తున్నారన్న ఆరోపణలూ వినవస్తున్నాయి. జిల్లాలో పోలీసు యంత్రాంగం తమను ఆవరించుకొనివున్న మత్తును వదలించుకొని కొందరు కొంతైనా పట్టుదలగా పనిచేయకుంటే పోలీసులపైనే విశ్వాసం సన్నగిల్లి పోతుంది!

### ఇందుకూరుపేట విలేయోగదారుల సంఘం

ఇందుకూరుపేట మండల వినియోగదారుల సమావేశం 17 తేది ఎం. ఆర్. ఓ శ్రీ వెంకటసుబ్బయ్య ఆధ్వర్యంలో జరిగింది. అధ్యక్షుడుగా శ్రీ జొన్నలగడ్డ రామారావు, ఉపాధ్యక్షుడుగా శ్రీ ముంగర శ్రీనివాసులు, కార్యదర్శిగా శ్రీ పెనుబల్లి సీతారామానాయుడు, సంయుక్త కార్యదర్శిగా శ్రీ బి. ఎల్. భాస్కరరావు, కోశాధికారిగా శ్రీ పుష్పగిరి శ్రీకృష్ణయ్య ఎంపికైనారు. ఇంకా పదిమంది కార్యవర్గ సభ్యులుకూడా ఎన్నుకోబడ్డారు.

### నేను కడప రౌడీనికాను. అంత దోచుకోవడమూ లేదు!

ముత్తుకూరు గ్రామంలో కడపతరహా దౌర్జన్యరాజ్యం నెలకొనిందన్న గత రెండు వారాల జమీన్‌రైతు వార్తలను, ఎమ్మెల్యే

—తరువ 12 పేజీలో

# ఎందర్నో కుబేరుల్ని చేసిన గూడూరు మైకాపరిశ్రమకు నూరేళ్లు నిండిపోయాయా

గూడూరు సి వి సి మైనింగ్ కంపెనీ 75 ఏళ్ళ పండుగజరుపుకొంది. తన యజమానులను కుబేరులను చేయడమేకాదు, పశ్చిమపటంలో నెల్లూరుజిల్లాకొక ప్రత్యేక గుర్తింపు, గౌరవం సంతరించిపెట్టిన పురాతన సంస్థలలో ఇదొకటి. వ్యాపార సముద్రయానంలో రుఫాన్ కెరటాలకు వందలాది సంస్థలు తలాతలై చిన్నాభిన్నమైపోయినా; ఆటుపోట్లన్నింటినీ తట్టుకుని ఇప్పటికీ స్థిరంగా, సజీవంగా నిల్చిన అతి కొద్ది కంపెనీలలో సి వి సి ప్రముఖమైనది.

నిజానికి సి. వి. కృష్ణయ్యగారిచ్చిన రిపోర్టు ప్రకారం సి వి సి మైనింగ్‌కంపెనీ స్థాపించింది 1901 లో. అంటే ఇప్పుడు దానివయస్సు 87 సంవత్సరాలు; 88 అయినా అనుకోవచ్చు. కానీ సరిగ్గా పన్నెండేళ్ళ తర్వాత డెబ్బయైదేళ్ళ పండుగ జరిపారు. ఇది పుట్టిన తేది మర్చిపోవడంవల్ల జరిగిందో, లేక ప్లాటినంజూబిలీ జరపాలన్న నిర్ణయం అమలు చేయడానికి పుష్కరకాలంపట్టిందో తెలియదు.

సి వి సి సంస్థ స్థాపకుడు స్వర్గీయ చేవెట్టి వెంకట్రామయ్యశెట్టి. ఆయన ఆంగ్లేయుల నుంచి మైనుకొని, మైకా త్రవ్వకం ప్రారంభించారట. ఆ తర్వాత ఆయన గూడూరు ప్రాంతంలో దాదాపు ఇరవై గనులపై ఆధిపత్యం సంపాదించి, అభ్రకం పరిశ్రమకు తిరుగులేని రాజన్పించుకున్నారు. ప్రస్తుత కంపెనీ నిర్వాహకులు సి. ఆర్. రావు, సి. వి. కృష్ణయ్య ఆయన కుమారులే. 1988 లోనే సి. ఆర్. రావు ఇంగ్లండు, జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు, స్విట్జర్లెండు, హాలెండు, తదితర దేశాలు తిరిగి ఎగుమతి ఆర్డర్లు సంపాదించుకొని వచ్చారు. శ్రీ సి. వి. కృష్ణయ్య 1941లో అమెరికావెళ్ళి రెండేళ్ళుగడిపారు. తిరుగు

**సి వి సి మైనింగ్ కంపెనీ 75 ఏళ్ల పండుగ**

దారిలో ఆయన ప్రయాణిస్తున్న ఓడ కేప్‌టౌన్‌లో నిలిపివేయడంతో ఆఫ్రికా దేశాలుకూడా చూడగల్గారు. 1948 నుంచి చాలా సంవత్సరాలు జపాన్‌లో గడిపారు. సి వి సి, అనుబంధ కంపెనీలు కేవలం అభ్రకం త్రవ్వకంతో సరిపెట్టుకోకుండా, నేరుగా విదేశాలకు ఎగుమతులు చేసి ప్రపంచంలోనెల్లూరుజిల్లాపేరును మార్మోగించారు కృష్ణయ్య సోదరులు!

ఇంత ప్రసిద్ధమైన కంపెనీ వజ్రోత్సవ సభను, ఎందువల్లనో చాలా నిరాడంబరంగా జరిపేశారు. ప్రస్తుత మైకా

—తరువ 10 పేజీలో

# ... ఉత్తర క్రియలు

21-10-88 తేది శుక్రవారం

సూర్యోదయాత్పూర్వం 3 గంటలకు

మా తండ్రి

## యడ్లపల్లి వెంకటేశ్వర్లు B.A., గారు

పరమపదించారు.

4-11-88 తేది శుక్రవారం శిలోద్వాసన

5-11-88 తేది శనివారం పెత్తర్లు, సపిండీకరణం

,, ,, సేవాకాలము సాయంకాలము

6-11-88 తేది ఆదివారము వైకుంఠసమారాధన

,, ,, సేవాకాలము ఉదయము

నెల్లూరు పప్పులవీధిలోని మా స్వగృహమునందు జరుగునని తెలియజేయడమైనది.

కుమారులు : శ్రీనివాసరావు (సురేష్), సుధాకర్

భార్య : అనసూయాదేవి కోడళ్ళు : అమృతవల్లి, ప్రమీల

మనుమడు : సంజయ్; మనుమరాండ్రు : సుష్మ, స్వాతి.

## నెల్లూరు ముచ్చట్లు
### విమర్శకుడు

### ఢిల్లో ఢిల్లీ

ఇందిరమ్మ వర్థంతి సందర్భంగా ఢిల్లీకి పోవాలనుకునే కార్యకర్తలకు, 29 తేది స్పెషల్ ట్రైన్ ఏర్పాటు చేస్తున్నామని డి సి సి అధ్యక్షుడు శ్రీ కె. వి. సుబ్బారెడ్డి తెలియజేస్తున్నారు. వివరాలు ఆయన్నే అడగండి!

### వేమారెడ్డికి స్వస్థత

బైపాస్ ఆపరేషన్ చేయించుకున్న శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి పూర్తిస్వస్థత పొందారు; మొన్న నెల్లూరుకువచ్చి మిత్రులను పలకరించిపోయారు. స్వగ్రామం [illegible]లో వుంటున్నారు.

కాశీకిపోయినవారు తనకు అత్యంత ప్రీతికరమైన ఆహారపదార్థాన్ని దేనినైనా వదిలివేస్తారంటారు. అట్లా మన వేమారెడ్డి బైపాస్‌కు పూటరప్పకుండా కావలసిన మాంసాహారాన్ని త్యాగంచేశారట. పాపం!

### కమీషనర్ సస్పెన్షన్

చిలకలూరిపేటలో చేసిన పాపాల్కు కావలికి వచ్చిన తర్వాత సస్పెండ్ గావించబడినాడు, మునిసిపల్ కమీషనర్ శ్రీ పి. దీనదయాళ్. ఆయన స్టే కోసం హైదరాబాదు పోయివున్నారట; ఈ రోజుకు వాయిదా పడివున్నదట.

సూపర్‌వైజర్ శ్రీ సంధానీ బాషా కమీషనర్‌గా సంపూర్ణాధికారాలతో వ్యవహరిస్తున్నారు.

### ఫాతిమా కేసు

డిఫెన్సు సాక్షులెవరూ లేనందువల్ల బషీర్ హత్యానేరం అడ్జర్నమెంటు కొరకు నవంబరు 7 తేదికి వాయిదా వేయబడింది.

### వి. ఆర్. కాలేజి సీట్లు

విద్యాసంవత్సరం సగభాగం పూర్తయిపోయింది; ఇప్పటివరకు వి ఆర్ కాలేజిలో సీట్ల కేటాయింపు పూర్తికాలేదట. వందలాది మంది విద్యార్థులు ఇంకా గాలిలో వుండిపోతున్నారు. కాలేజి యజమాన్యం వెంటనే ఈ అపసవ్యతను సరిదిద్దుకోకుంటే ఆందోళన చేస్తామని బెదిరిస్తున్నారు. విద్యార్థిసంఘం నాయకులు.

భక్తవత్సలురెడ్డిగారూ- ఏమిటీ గ్రుడ్డి దర్బారు?

### కావలి నిరాహార దీక్ష

ఎక్కడో తూర్పుగోదావరిజిల్లా తూర్పు కంపలో తన అనుయాయులపై తప్పుడు కేసులు పెట్టినందుకు నిరసనగా ఆమరణ దీక్షచేస్తున్న మాజీమంత్రి శ్రీ ముద్రగడ పద్మనాభంకుమద్దతుగా కావలిఒకటవవార్డు కౌన్సిలర్ శ్రీ తోట వెంకటేశ్వరరావు మరో ఐదుగురు అనుయాయులతో 27తేది ట్రంకు రోడ్డులో మునసబు కోర్టుకు ఎదురుగా నిరాహారదీక్ష సాగించారు. దీక్ష [illegible]! ఈ సర్దకు నిరసన కావలీయుల్లో కించిత్ కూడా స్పందన కల్గించలేదట.

పిడుగుకు బియ్యానికి ఒకే మంత్రం అన్నట్లు, చిన్నదానికి పెద్దదానికి నిరాహార దీక్ష అనేసరికి, పవిత్రమైన ఆ అహింసా ఆయుధం పదును కోల్పోయింది; చుల్కనైపోయింది!

### హోటల్ గురు

వెన్నెల హోటల్లద్వారా తమ అదృష్టాన్ని పరీక్షించుకొన్న కె. వి. ఆర్. చంద్రయ్య, ఆయన మిత్రబృందం-నాన్ వెజిటేరియన్‌తో హోటల్ గురు ప్రారంభించారు. పాత క్రైంస్టేషన్ భవనానికి కొత్త రూపుదిద్ది మొన్న 21 తేది తమకులామే రిబ్బను కత్తిరించుకున్నారు. ఎవరినైనా పిలిస్తే ఖర్చనుకున్నారోఏమో!

వెన్నెల విజయంతో చంద్రయ్య పట్టిందల్లా బంగారమయ్యే భాగ్యశీలుడని రుజువైపోయింది; ఇప్పుడీ హోటల్‌తో అది పునరావృతం కావాలని ఆకాంక్షిస్తున్నాము.

### అమానుషం!

అంగవికలుడుగా జన్మించిన నేరానికి తండ్రిచే తిరస్కరింపబడి, గూడూరులో తన మాతామహుని పోషణలో పెరిగి పెద్దవాడైన నవకోటి గగారిన్ (21) అనే యువకుడిపైన, లక్షరూపాయలుచేసే తాత ఆస్తి తనకుదెందకుండా అడ్డుతగులుతున్నాడనే క్రోధంకొద్దీ అతడితండ్రి అయిన నవకోటి వీరరాఘవులు 20 తేది కిరోసిన్ పోసి తగులబెట్టగా, అతను నెల్లూరు ఆస్పత్రికి తరలించబడి దుర్మరణంపాలైనాడట. ఈ పైశాచికానికి తన తండ్రే పాల్పడ్డాడని ఆ యువకుడు మరణవాఙ్మూలంలో చెప్పాడట.

సదరు వీరరాఘవులు మనుబోలువాసి అని, తిరుపతి ఆర్. ఎం. ఎస్. లో మెయిల్ అటెండరుగా పనిచేస్తున్నాడని తెలుస్తున్నది. గూడూరు పోలీస్ దర్యాప్తు చేస్తున్నది.

### మరణాలు

మాజీ మునిసిపల్ కౌన్సిలరు, బంగారు వగలవ్యాపారి శ్రీ గుండాల వెంకటసుబ్బారెడ్డి (బుజ్జిరెడ్డి) అర్ధాంగి శ్రీమతి సుబ్బరత్నమ్మ (66) మూడుకోణాల మలేరియా జ్వరంతో బాధపడుతూ, అది [illegible] 26 తేది కన్నుమూసింది. ఆమెకు నలుగురు కుమారులు, ఒక్క కుమార్తె వున్నారు. రోడ్లు భవనాలశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా రిటైరైన శ్రీ రేబాల పెంచలరెడ్డి, జనరల్ రేడియో నారాయణరెడ్డి ఆమె సోదరులు.

ఈ వయస్సులో జీవిత భాగస్వామిని కోల్పోయిన బుజ్జిరెడ్డికి, వారి కుటుంబ సభ్యులకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

సుబ్బరత్నమ్మ ప్రాణాలు తీసింది మెలిగ్నెంట్ మలేరియాఅట. ప్రమాదకరమైనదట. దోమలద్వారా వచ్చే భయంకర వ్యాధి ఇది. దోమలను అరికట్టకుంటే పౌరుల ప్రాణాలు ప్రమాదంలోపడ్తాయి. మునిసిపల్ ఆరోగ్యశాఖ దోమల నివారణా కార్యక్రమానికి ప్రథమస్థానమివ్వడం అవసరం.

* * *

కాంగ్రెస్‌సేవాదళాధిపతిగావుండిన శ్రీ ఎన్. వెంకటనాయుడు (87) 27 తేది హఠాత్తుగా మరణించారు. ఆయనకు తల్లి, భార్య, ఒక కుమారుడు వున్నారు. వెంకటనాయుడు నెల్లూరు తాసిల్దారుగా గుండెపోటుతో అకాలమరణానికి గురియైన శిరోమణి కుమారుడు.

వెంకటనాయుడిది సహజ మరణంగా వున్నట్లులేదు; ఆత్మహత్య అని వదంతి.

కాంగ్రెస్ కార్యక్రమాల సమయంలో ఇందిరా భవన్‌లో ఖద్దరు యూనిఫారంలో స్వచ్ఛంద సేవకుడుగా నిండుగా పతాకవందనలంతు నడిపించేవాడు. ఏ సంఘటన అతనికి జీవితంమీద విరక్తి కల్గించిందోగాని చరమప్రాయంలో నూరేళ్ళు పూర్తిచేసుకున్న ఆ అభాగ్యుని ఆత్మశాంతికి ఒక కన్నీటి బిందువు రాల్చుదాం!

* * *

నెల్లూరు ఆకాశవాణి విలేఖరి శ్రీ డి. వసంతమాధవరావు మాతామహుడు, 102 ఏళ్ళు పరిపూర్ణ జీవితాన్ని గడిపిన సంస్కృత పండితుడు శ్రీ మణుగూరి నరసింహాచార్యులు తెనాలి సమీపం నందివెలుగు గ్రామంలో కాలధర్మం చెందాడట. భార్య, పదిమంది సంతానంవున్నారు. ధన్యజీవి!

### వ్యవసాయ పరిశోధకుడు డాక్టర్ కృష్ణప్రసాద్

అకోలా పంజాబ్ రావ్ విద్యాపీఠంలో వ్యవసాయంలో ప్రతిభతో బి. ఎస్‌సి. డిగ్రీ; బెనారస్ హిందూ యూనివర్సిటీ నుండి ఎం.ఎస్‌సి. పట్టం పొంది; మైకాలజీ, ప్లాంట్ పాథాలజీలలో పరిశోధన జరిపి ఆ విశ్వవిద్యాలయం నుండే డాక్టరేట్ (పిహెచ్.డి.) సాధించిన నెల్లూరు యువకుడు డాక్టర్ నంబూరి వెంకటకృష్ణప్రసాద్.

కృష్ణప్రసాద్‌కు సీనియర్ ఫెలోగా ఐ.సి.ఎ.ఆర్. ప్రాజెక్టులో రెండేళ్ళ పరిశోధనానుభవం వుంది. విత్తనాలమూలంగా వచ్చే అనేకతెగుళ్ళకు సంబంధించి పెక్కు రచనలు చేశాడు కృష్ణప్రసాద్.

కృష్ణప్రసాద్ అమంచర్ల గ్రామస్థుడు; గ్రామసేవకుని వుద్యోగం నుండి వ్యవసాయశాఖ డెమాన్‌స్ట్రేటరు వుద్యోగం వరకు ఎదిగి, ప్రస్తుతం నెల్లూరు సాయిల్ టెస్టింగ్ లేబొరేటరీలో అగ్రికల్చర్ ఆఫీసరుగా వున్న శ్రీ ఎన్. వి. సుబ్బయ్య కుమారుడు.

### నీటిమట్టం

సోమశిల రిజర్వాయరు (24 తేది)

| | |
|---|---|
| | 14.48 టి. ఎం. సి. (262.02 అ.) |
| పెన్నడెల్టాకు విడుదల | 7380 క్యూ. |
| సంగం ఆనకట్టపైన | 1.8 అ. |

—కొరవ 7వ పేజీలో



## • శ్రద్ధాంజలి •

## శ్రీమతి గాలి ధనలక్ష్మి

1982వ సంవత్సరం అక్టోబరు 8వ తేది మమ్ములనందరినీ దుఃఖసాగరమున ముంచి దివంగతురాలై 23-10-88 తేదికి ఆరు సంవత్సరాలు నిండినవి. ఆరవ వర్థంతి సందర్భంలో శ్రద్ధాంజలి ఘటిస్తూ-

గాలి వెంకటప్పనాయుడు (భర్త)
వేలమూరు రామకృష్ణప్రసాద్ (తమ్ముడు)
Lecturer (NBKR-IST.)
వేలమూరు జ్ఞానప్రసూనాంబ (కుమార్తె)
బద్దేపాటి వెంగమాంబ (కుమార్తె)

గాలి రవిశంకర్ (కుమారుడు)
గాలి రవీంద్ర (కుమారుడు)
గాలి నారాయణస్వామి (మరిది)
గాలి మాధవయ్యనాయుడు (మరిది)
బద్దేపాటి సురేంద్ర (అల్లుడు)

మరియు

**HOTEL R R R** Near Uma Talkies, Gandhi Square, Mysore.

యాజమాన్యం మరియు సిబ్బంది.

**HOTEL R R R** MYSORE Gandhi Square, Mysore.

# పెండ్లిండ్లు

### జడ్జి కుమారుడు

సుప్రసిద్ధ న్యాయవాది, వి. ఆర్. కాలేజి కరస్పాండెంటు శ్రీ మేనకూరు అతి శేషారెడ్డిగారి మనుమడు; అంటే, కృష్ణ జిల్లా సెషన్సు జడ్జి శ్రీ ఎం. మోహనరామ రెడ్డి తనయుడు, బి. ఎస్‌సి.-ఎం. బి. ఎ. పట్టభద్రుడు శ్రీనివాసమహేశ్ వరుడు.

కాంట్రాక్టరుగా మారిన ఇంజనీరు, అసలు సిసలు రైతు, నిజాయతీ పరుడైన వ్యక్తి శ్రీ ఇ. రాజగోపాలరెడ్డి తనయ, వైద్య విద్యార్థిని శైలజ వధువు.

వీరి వివాహం 21 తేది నెల్లూరు టి. టి. డి. లో వైభవోపేతంగా జరిగింది. న్యాయమూర్తులు, న్యాయవాదులు, ఉభయుల బంధుమిత్రవర్గము కలిసేటప్పటికి ఆవరాతుం రద్దీ అధికంగానే వుండింది. వివాహ తంతు హాలులోనివారేకాక బయట వున్న వారుకూడా కన్నులవిందుగా చూడడానికి టి.వి. లు ఏర్పాటయ్యాయి.

### సెప్టెంబరు పెండ్లిండ్లు

తాసిల్దారుగా రిటైరైనా, ఏడు పదుల వయసు నెత్తినపడినా ఆ పాతవేషభాషలు, తీవి హుందాతనాలుమాత్రం అట్లనేవున్న స్నేహపాత్రుడు,నిగర్వి,నిరాడంబరుడైన శ్రీ బి. లాజరస్ తనయ మార్గరేట్ సెల్వరాణి;మద్రాసు,శ్రీ ఎస్. జెరెమయ్య కుమారుడు ఇమాన్యుయల్ మోహన్ పరిణయం 28 తేది మద్రాసు బస్టాండు వద్దవున్న సి.ఎస్.ఐ. చర్చిలో క్రిస్టియన్ సంప్రదాయబద్ధంగా జరిగింది.

* * *

డి. వి. ఆర్యోగిగా రిటైరైన పొదుగురు కొత్తకోట పులిమి వెంకురెడ్డిగారి కుమారుడు సోమశేఖరరెడ్డి; గుంటూరుజిల్లా పల్లపాడు వాసి శ్రీ చెల్లా పుల్లారెడ్డి కుమార్తె హేమ వివాహం ఇటీవల గుంటూరు టి. టి. డి. లో జరిగింది.

* * *

కనిగిరి తాలూకా పెదచెర్లోపల్లి ఆర్యాపక మిత్రుడు శ్రీ వీరపనేని చెన్నయ్య కుమార్తె రాజేశ్వరి (బి. ఎ.); కీ. శే. గొగల వెంకటరామయ్య కుమారుడు వెంకటేశ్వర్లు బి. ఎ., బి. ఇడి., వివాహం 7 తేది పెదచెర్లోపల్లిలో వధువు ఇంట జరిగింది.

* * *

సూళ్లూరుపేట, రిటైర్డ్ రెవిన్యూ ఉద్యోగి యుడు శ్రీ చెదుకుపల్లి వెంకటరెడ్డి కుమారుడు; అంటే 'శివప్రియ' హోటల్ యజమాని, ఫైనాన్సు వ్యాపార ప్రముఖుడు, సౌజన్యమూర్తి శ్రీ చెదుకుపల్లి పిచ్చిరెడ్డి అన్న కుమారుడన్నమాట. రామ్‌కుమార్; నెల్లూరు. శ్రీ మేదరమెట్ల కోటారెడ్డి కుమార్తె శ్రీ లక్ష్మి కళ్యాణం 15 తేది టవున్‌హాలులో అంగుకంసందులేని ఆవరాతులతో, వధూవరులు కనపడకుండా పేటియా. తెమేదాం అన్నగోడతో విజయవంతంగా జరిగింది.

* * *

కోవూరు వ్యవసాయదారుడు, నెల్లూరు సుజాతమ్మకాలనీ కొత్తవిలాసమీయుడు శ్రీ కాటంరెడ్డి రంగారెడ్డి మనుమరాలు, శ్రీ గోపాలరెడ్డి పుత్రిక సీలిమ; హైదరాబాదు-పి. డబ్ల్యు. డి. డెప్యూటి ఛీఫ్ ఇంజనీరు శ్రీ సి. సూర్యనారాయణరెడ్డి పుత్రుడు రఘురాం పరిణయం 14 తేది నెల్లూరు టి. టి. డి. లో జరిగింది.

* * *

సుళేదారుపేట 'పికో' యజమాని వి. రవీంద్రరెడ్డి వివాహం జ్యోతిర్మయితో 14 తేది టవున్‌హాలులో జరిగింది. ★

## పి సి సి

(మొదటి పేజీ తరువాయి)

మంది రైతులు ఆక్రమించేశారు. వాళ్ళెప్పట్లో లేచిపోయేటట్లు కన్పడడం లేదు. కనీసం 8 రోజులముందు మైదానం తమకు అప్పగించకుండే తాము సభకు ఏర్పాట్లు చేయలేమని ఇంటలిజెన్సు అధికారులు స్పష్టంగా చెప్పేశారట. ఆ గందరగోళంలో పడివున్న ఢిల్లీ నాయకులు దానికొక పరిష్కారం దొరికేవరకు పిసిసి వంటి సమస్యలను పట్టించుకోగలరని భావించలేము.

కొందరు చెప్పడం-ఆంధ్రకు సంబంధించి నిర్ణయం ఎప్పుడో జరిగిపోయిందని, కర్ణాటకలో వీరేంద్రపాటిల్ అభ్యర్థిత్వానికి మూపనార్ అభ్యంతరం పెట్టడంతో, దానికొక పరిష్కారం కనుగొనలేక మూడు రాష్ట్రాల వ్యవహారాలను వాయిదావేసేశారని చెప్తున్నారు.

కారణం ఏదైనా ప్రజలదృష్టిలో కాంగ్రెస్ నాయకత్వం అభాసుపాలైంది. పిసిసి అధ్యక్షపదవికిరూడా పేడుతేల్చలేని అనిర్ణయవైఖరి విమర్శలకు దారి తీస్తున్నది.

రాజీవ్‌గాంధీ ఢిల్లీకి తిరిగిపోయారు. పహాడియా ఈరోజు (28 తేది) ఆయన ఇంటర్వ్యూ సంపాదించగలిగితే సాయంత్రంకాకపోతే, రాత్రికిఅయినా ప్రకటన వెలుపడుతుంది. లేకుంటే తిరిగి నవంబరు మొదటివారంవరకు ఆ ఊసెత్తుకునే వ్యవధి కాని, ఊపిరిపీల్చుకునే తీరికకూడా లేనంత ముమ్మరమైన కార్యక్రమాలున్నాయి ప్రధానికి! అప్పటివరకు అందరూ ఎదురు చూడాల్సిందే! ★

(6వ పేజీ తరువాయి)

| | |
|---|---|
| నెల్లూరు ఆనకట్టపైన | 1.8 అ. |
| కనిగిరి రిజర్వాయరు | 20.5 అ. |
| సర్వేపల్లి రిజర్వాయరు | 5.5 అ. |
| నెల్లూరు చెరువు | 12.8 అ. |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | పుట్టి | 2500.00 |
| ఐ. ఆర్. 20 | | 2800.00 |
| సున్నాలు | | 2200.00 |
| మొలగొలుకు బియ్యం (70కి) | | 850.00 |
| బంగారు సవర (8 గ్రా) | | 2860.00 |
| వెండి 10 గ్రా | | 65.00 |







### నతుపల్లి డి॥ ము॥ కోర్టు

**S C S No. 48/86**

**Between-**

నాగార్జున గ్రామీణబ్యాంకు మరియు
1) గానుగపాటి లక్ష్మిసరోజిని
2) గానుగపాటి వెంకటరావు
3) దమ్మాలపాటి కృష్ణయ్య

వాది నాగార్జున గ్రామీణబేంకు బ్రాంచి కిష్టారం, ప్రతివాదులపై ఋణ్యకొరకు దావా వేసినారు. ఆ ట్టి దావాలో వాయిదా తే 8-11-88 దిన వున్నది. ఆ రోజు ఉదయం 10-30 గంటలకు 1, 2 ప్రతివాదులు గానుగపాటి లక్ష్మిసరోజిని W/O వెంకటరావు, గానుగపాటి వెంకటరావు, S/O రామయ్య కోర్టులో హాజరు కావలయును. అట్లు కానిచో కోర్టువారిచే ఎక్స్‌పార్టీ ఆర్డర్ ఇవ్వబడును.

—ఎ. వాసుదేవరావు,
వాదితరపు అడ్వొకేటు

### ప్రకటన

వెంకటగిరి మండలం, ఓన్నపరెడ్డిపల్లె కాపురస్తుడైన పాగాల రాజారెడ్డి అను నేను ఇందుమూలముగా యావన్మందికి తెలియజేయడమేమనగా నాయుడుపేట, కాళహస్తి రోడ్డులోని లక్ష్మిఅనంతసాగరం తరఫ్ అగ్రహారపేట అను ప్రదేశమున మాతల్లి స్వర్గీయ ముమ్మారెడ్డి సరోజనమ్మ గారుకు 25 అంకణాల స్థలం, అందులోని 12 అంకణాల ఇల్లు వున్నది. అది మా హక్కు అనుభవములో వున్నది. దానిని మాకు తెలిసిన కొందరు అమ్మజూపుతున్నట్లు తెలియుచున్నది. దానిని అమ్ముటకుగాని, తాకట్టులుగాని ఇతర విధములైన పరాధీనములుగాని చేయుటకు ఎవ్వరికినీ హక్కులేదు. అట్లుచేసినచెల్లదు; అందుమీదట మేముతీసుకొనబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

పి. రాజారెడ్డి.

### నతుపల్లి డి॥ ము॥ కోర్టులో

**O S No. 119/86**

**Between-**

నాగార్జున గ్రామీణ బ్యాంకు మరియు
1) అయినంపూడి ఓబ్లయ్య
2) నరుకుళ్ళ సత్యనారాయణ
3) యాదుపుగంటి

వాది నాగార్జున గ్రామీణ బేంకు బ్రాంచి కిష్టారం. ప్రతివాదులపై దబ్బుకొరకు దావా వేసినారు. అట్టి దావాలో వాయిదా తే 11-11-88 దిన వున్నది. ఆ రోజు ఉదయం 10-30 గంటలకు 1-వ ప్రతివాది అయినంపూడి ఓబ్లయ్య S/O. బసవయ్య కోర్టులో హాజరుకావలయును. అట్లు కానిచో కోర్టువారిచే ఎక్స్‌పార్టీ ఆర్డర్ ఇవ్వబడును.

—ఎ. వాసుదేవరావు,
వాదితరపు అడ్వొకేటు



### ప్రకటన

ఇందుమూలముగా యావన్మందికితెలియ చేయడమేమనగా, ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఇంటిని నా కక్షిదారుడైన బసిరెడ్డి హనుమారెడ్డి, S/O. వెంకటసుబ్బారెడ్డి, నెల్లూరుజిల్లా, తోటపల్లిగూడూరుమండలం, కొత్తపాళెంగ్రామ కాపురస్తుడు, సదరు గ్రామ కాపురస్తుడైన వేళ్ళపాలెం చంద్రశేఖరరెడ్డి వద్ద 15-12-81 తేదిన అగ్రిమెంటు ద్వారా కొనుగోలుచేసి ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఇంటిని ఆరోజు నుంచి స్వాధీనపరచుకొని సర్వహక్కులు కలిగి యున్నారు. ఈ క్రింది షెడ్యూలు ఇంటిని వేళ్ళపాళెం శ్రీనివాసులురెడ్డి, దయాకర రెడ్డి అనువారలు దురుద్దేశ్యపూర్వకంగా పరాధీనముచేయ ప్రయత్నించుచున్నారు. వారుగాని మరెవరైనా చేయు పరాధీనములు చెల్లనేరవని నా కక్షిదారుడిని అర్థగించవలసియా తెలుపనైనది.

షెడ్యూలు

నెల్లూరు డి॥ రిజిస్ట్రేషన్, ఇందుకూరుపేట స॥ రి॥ కొత్తపాళెం గ్రామం 1 వ నెంబరు పట్టా ఎస్. నెం 231-ఎ 7-75 సెంట్లులో య 0-25 ట్లు ఇందులో కొంత ఉమ్మడి పోను 133 అంకణముల స్థలము యున్నూ, ఇందులోని 7 అంకణముల రాతిగోడలు కట్టుబడిగల పూరియిల్లు, ఇందులో గల సిమెంటురేకుల వరండా.

—వి. రాధామనోహరం, అడ్వకేటు

### నెల్లూరు అఫిషియల్ రిశీవరు కోర్టులో

నెల్లూరు సబ్‌కోర్టు ఐ. పి. నెం. 14/77 కనుమూరు సుబ్బానాయుడు S/O వెంకట్రామానాయుడు, నిడిగుంటపాళెం నెల్లూరు తాలూకా —ఇన్‌సాల్వెంట్

యాలం ప్రకటన

పైనెంబరు ఐ.పి. లోని ఇన్‌సాల్వెంటు గారుకు నిడిగుంటపాళెం గ్రామంలోని భూములను 10-11-88 తేదిన పగలు 2 గంటలకు నెల్లూరులో ఈ ఆఫీసులో నావల్ల బహిరంగముగా యాలం వేయబడును. పాటదారులు షరతులు ఇస్తిహారు వగైరాలు యీ ఆఫీసు పనివేళలలో తెలుసుకొనవచ్చును.

—వి అంకిరెడ్డి, అఫిషియల్ రిశీవరు.

### నతుపల్లి డి. ము. కోర్టులో

**O S No. 235/86**

**Between-**

నాగార్జున గ్రామీణ బ్యాంకు మరియు
1) వర్షా రాములు 2) పిచ్చుర్తి విశ్వనాథం, 3) పెంటు రాములు.

వాది నాగార్జున గ్రామీణబ్యాంకు బ్రాంచి అన్నపురెడ్డిపల్లి, ప్రతివాదులపై దబ్బు కొరకు దావా వేసినారు. అట్టి దావాలో వాయిదా తే 8-11-88 దిన వున్నది. ఆరోజు ఉదయం 10-30 గంటలకు 3 వ ప్రతివాది పెంటు రాములు S/O నరసయ్య కోర్టులో హాజరు కావలయును. అట్లుకానిచో కోర్టువారిచే ఎక్స్‌పార్టీ ఆర్డర్ ఇవ్వబడును.

—ఎ. వాసుదేవరావు,
వాదితరపు అడ్వొకేటు

## 'ఉద్యోగ వార్తలు'

మీకు ఉద్యోగం కోసం వెతుకుతున్నారా? అయితే ఈ పేపర్ చదవండి. తక్షణం ఉద్యోగంలో చేరండి.

"ఈనాడు ఉద్యోగ వార్తలు"
ప్రియ అడ్వర్టైజర్స్
కోంపల్లి కాంప్లెక్స్
స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు-2

## నెల్లూరు 4వ అ॥డి॥ ము॥ కోర్టులో

O. S. No. 560 of 1988

ఇండియన్ బ్యాంకి రెప్రజెంటెడ్ బై ఇన్స్ బ్రాంచి మేనేజరు నెల్లూరు -వాది

ఎదిరి

1) బి. అప్పయ్య S/O. రంగయ్య 556/7 రాకలివీధి, నెల్లూరు-1.
2) వి. తిరిపాలు S/O. వెంకటేశ్వర్లు -ప్రతివాదులు

ఏనుగ సుందరరామిరెడ్డి స్కూలుకు ఎదురుగా మూలాపేట, నెల్లూరు

వాదికిరావలసినబాకీ రూ. 15188-45 రాబట్టుటకు ప్రతివాదులకు దావా నోటీసు 4.11.88 తేది కావున ప్రతివాదులు స్వయముగాగాని లేక ప్లీడరుద్వారాగాని పై కోర్టులో ఉదయం 10-30 గంటలకు హాజరయి ఆక్షేపణలను తెలుపుకొనవలసినదిగానున్నా లేనియెడల సదరు విషయము ప్రతివాదుల పరోక్షములో తీర్మానించబడునని తెలియజేయడమైనది.

-ఎస్. వెంకటసుబ్బారెడ్డి
వాది వకీలు

## ప్రకటన

ఇందు మూలకముగా యావన్మందికి తెలియజేయడమేమనగా అద్దేపల్లి రంగయ్య కుమారులు అద్దేపల్లి వెంకటసుబ్బయ్య, అద్దేపల్లి బద్రినారాయణ జాయింటుఆస్తులు అనగా నెల్లూరు శిఖరంవారి వీధిలోని డోరు నంబర్లు 18,222, 18/223, 16/224, మరియు నెల్లూరు చిన్నబజారులోని 19/505, 18/491, డోరు నంబర్లుగల, ఇల్లు కొట్లుకల్గియున్నారు. యింకనుయితర ఆస్తులు కలిగియున్నారు. అద్దేపల్లి వెంకటసుబ్బయ్య గతించి నందున వారి యొక్క కుమార్తెనైన నేను (పేర్ల సత్యనారాయణ భార్య పేర్ల ప్రసూన), నాయొక్క తండ్రిగారి యింటి కుటుంబములోని ఆస్తులకు పంపకదావా నెల్లూరు సబ్‌కోర్టులో O.S No 160/88గా దాఖలుచేసి 1/12వ భాగమును కోరియున్నాను. అదేరోజు కోర్టులో ఇంజంక్షన్ అర్జీ దావా పెండింగు లోయున్నది. సదరు దావా తీర్మానము అయినంత వరకునదరు ఆస్తుల, అద్దేపల్లి బద్రినారాయణగారి వారికి సంబంధించిన కుటుంబసభ్యులుగాని, అమ్ముటకుగాని, తనఖా పెట్టుటకు గానీ హక్కులేదు. అట్లు ఎవరైనా కొనినా తనఖాపెట్టుకున్నను వారు నష్టపోగలరు. నేను తీసికొనబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు వారే బాధ్యులు అగుదురు.

ఇట్లు
-పి. ప్రసూన

## నంద్యాల సబ్ జడ్జి కోర్టులో

I. P. 14/86

సయ్యద్ ఖాశింసాబ్ -పిటీషనరు

Vs.

ఇరగన బోయిన బిజ్జయ్య, వగైరాలు -రెస్పాండెంట్లు

ఆర్. 5, సిరాంబ బోయ వెంకటస్వామి
ఆర్. 21, షెట్టి మహమ్మద్ హుసేన్

నోటీసు

ఈ నెంబరులో 5, 21 రెస్పాండెంట్లకు నోటీసు నిమిత్తము 15-11-88 వ తేదీన వాయిదా ఉన్నది. కావున 5, 21 రెస్పాండెంట్లు అయిన మీరు 15-11-88వ తేదీన ఉదయము 10గం॥కు కోర్టువారి ఎదుట హాజరై మీ ఆక్షేపణలు తెలుపుకొనవలయును. లేనంతట మీపై కోర్టువారు ఎక్సు పార్టీగా తీర్మానించెదరు.

-బి. టిబుల్‌రెడ్డి
వాది తరఫు అడ్వకేటు

## గూడూరు డి॥ము॥ కోర్టులో

E. P. 42/87

O. S. 120/84

పెళ్లేటి రమణారెడ్డి -డి.హో.
పాతెర్ల కృష్ణారెడ్డి -జె.డి.ఆర్.

సదరు నెంబరు ఇ. పి. లోని జె. డి. నుండి డిక్రి బాకీని రాబట్టుకొను నిమిత్తం జె.డి.ఆర్. తాలూకు స్థిరాస్తిని 21-11-88 తేది ఉదయం 10 గం॥కు పై కోర్టులో బహిరంగముగా వేలం వేయబడును. పాడదలచినవారు పాడుకొనవచ్చును.

షెడ్యూలు : నెల్లూరు రి॥డి॥ యిలాకా గూడూరు స.రి.డి.లో చేరిన చిల్లకూరు మండలం తిక్కవరం మజరా తిప్పగుంట పాళెం గ్రామంలో (ప్రతివాది) జె. డి. ఆర్.కు హక్కు అనుభవంగల షుమారు 30 అంకణములు 200.70 చ॥మీ॥ ఖాళీ స్థలం యిందులో కట్టియున్న 4 అంకణములు 26.76 చ॥మీ॥ గల పూరి యిల్లు యింటికి నంబరులేదు. తూ) సగుటూరు సుబ్బరామిరెడ్డి పశువులకొట్టాం; ద) రాజవీధి; ప) కారూరు బాలకృష్ణారెడ్డి కొట్టాం ఉ) పాతెర్ల బలరామిరెడ్డి వాములదొడ్డి మరియు యింటి దోటు

వాది క్రయం రూ. 3500/-
అమీనా క్రయం రూ. 5000/-

-సి. వి. సుబ్బారెడ్డి
డి. హో. తరపు అడ్వొకేటు

## In the Court of the Dist. Munsif, Penukonda

O. S. 151/76

E. P. 8/88

Sakala Siddaraju Tq. Hindupur D Hr.

Vs.

N. V. Rami Reddy
S/o, V. Venkata Reddy
Nagalur, Penukoda. -J. D. R.

The Schedule properties will be sold in Public Auction in the above court on 29-11-88 any one can come ane bid.

Schedule :- Lands in Nagalur in the R. D. of Anantapur and S. R D. of Penukonda.

tem 1. S. No. 509, A.C. 5.19, Hcts 2.092, Taram 76.00, 1/2 Share.

Item 2, S.No. 664-3, A.C 0.68, Hcts 0.275, Taram 6.00, 1/2 Share.

-M. S. RAMAKRISHNA
Advocate

# ముఠాలసంఖ్య

(2వ పేజి తరువాయి)

చేరుతారు. రాత్రివేళ్ళకు రోటివేస్తే తెగి పళ్ళు వళ్ళో రాలినట్లు వచ్చిపడింది ఆయన సకావడవి. నాకు వద్దుమొర్రో అని గండి పేట చెవిడిలో మొర పెట్టుకున్నా వినకుండా కుర్చీలో కుదేశారు పాపం! అయినా రాజకీయవాది కాబట్టి, రాజీ పడిపోయారు.

చిన్నపదవి అని అలిగివున్న నరసింహంగారిని ఈమధ్య మామా అల్లుళ్ళు హైదరాబాదుకు పిలిపించి చివ్వారట. ఆ సమావేశంలో ఆయన నెల్లూరు జిల్లాలో 'మన వాడు' వెనుకబడిపోతున్నారని; ప్రాముఖ్యం కల్గిన పదవులన్నీ 'వాళ్లు' అనుభవిస్తుండడంతో 'మనవాడు' ఏ కష్టం వచ్చినా చెప్పుకునే దిక్కుకూడా లేకుండా పోతున్నదని ముఖ్యమంత్రికి మొర పెట్టుకున్నారట. అందుకు ఎన్టీఆర్ ప్రతిస్పందించి 'మనవాళ్ళనందరినీ' నాదగ్గరకు తీసుకొనిరండి. నేరుగా నాకే చెప్పుకో మనండి అన్నారట. అర్చేవాడ్ని తీర్చేవాడ్ని నేనయినప్పుడు, నేను తప్ప నా పార్టీలో అంతా మిథ్య అయినప్పుడు మీ రెందుకు బాధపడతారు అని కన్నీళ్ళు తుడిచారట.

దాని ఫలితమే మొన్న మంగళవారం రెండు బస్సులతో ఏర్పాటైన హైదరాబాదు యాత్ర. ఈ వార్త వినగానే, తమ కాళ్ళ క్రిందకు నీళ్ళు వస్తాయనే భయంతో రమేష్ రెడ్డి, వేగ నారసింహారెడ్డి కంగారుపడిపోయి నరసింహంగారి బస్సెక్కుతారనే సందేహం కల్గిన కౌన్సిలర్లను, ఇతరులను పిలిపించి ఏవో మాయమాటలు చెప్పారు. వాళ్ళు భయపడింది వీళ్ళంతా తమకువ్యతిరేకంగా మూలవిరాట్టుకు చాడీలు చెప్తారని; కాని ఆ మూలవిరాట్టే వీరివాళ్ళకు పసలుపూసి తన దగ్గరకు రప్పించుకొంటున్నాడని తెలియడంతో ఇద్దరూహతాశులైపోయినట్లున్నారు; రమేష్‌రెడ్డి వీరికంటేముందుగా హైదరాబాదు రైలెక్కారు.

స్పిన్నింగ్‌మిల్లు, మార్కెటింగ్‌సొసైటీ, లైబ్రరీ, పాల ఉత్పత్తిదారులసంస్థ, పార్టీ కార్యదర్శిత్వం వగైరా వగైరాలన్నీ 'తన వాళ్ల'కే ఇచ్చి, ఇంకా వాళ్ళను మేమేదో చేస్తున్నామనిచెప్తే నమ్మి, హైదరాబాదుకు పిలిపించడమేమిటని జిల్లా నాయకుల ఆక్రోశం. పేదవాడికోపం పెదవికిచేటు కాబట్టి, లోపలే కుమిలికుమిలి పోతున్నారు పాపం!

మొత్తంమీద ఎన్టీరామారావు నెల్లూరు జిల్లా తెలుగుదేశం నాయకులను తోలు బొమ్మలనుచేసి ఆడిస్తున్నారు. తోకలు కత్తిరించి వినోదిస్తున్నారు. ఆత్మను చంపుకునే ఎవరైనా తెలుగుదేశంలోచేరాలి. ఆత్మగౌరవం, వ్యక్తిత్వం త్యాగంచేసిన ఏ అవమానాన్నయినా సంతోషంగా భరించడంసహజంకదా! ఇప్పుడు జిల్లాలో జరుగుతున్నదదే! ★

# సింహపురి

(4వ పేజి తరువాయి)

### స్పందన

'చేతన' అచేతనమైపోయిన తర్వాత యువకవులు, సాహిత్యకారులలో నెలకొన్న నిర్లిప్తతను తొలగించడానికి, కవితా స్పందన కల్గించడానికి మాటి చేతనీయులు 'స్పందన' అనే సాహిత్య సంస్థను ప్రారంభించారు మొన్న 28 తేది దీనికి ప్రారంభోత్సవం జరిగింది. దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయ భవనంలో, ఓ. పి. ఆర్. ఒ శ్రీ వై వి రత్నం 'స్పందన'ను ప్రారంభించారు. శ్రీ సత్యవేటి శ్రీకాంత్ సభాధ్యక్షుడు. స్పందన ప్రధాన కార్యదర్శి శ్రీ సి. నారాయణరావు తమ సంస్థ పుట్టుపూర్వాలను వివరించారు. శ్రీ సుధాకర రెడ్డి, శ్రీ డి. సుధాకరం మాట్లాడారు.

ప్రారంభ కార్యక్రమంగా యువ కవుల మినీ కవితా సమ్మేళనం జరిగింది. పచ్చిపులుసు వెంకటేశ్వర్లు, జయంపు కృష్ణ, తదితరులు తమ కవితలు విన్పించారు. శ్రీ కె. ఎస్. వి. రాజా వందనాలు చెప్పారు.

### హెడ్‌పోస్టాఫీసు దుస్థితి

నెల్లూరు హెడ్‌పోస్టాఫీసు పరిస్థితి చాలా అధ్వాన్నంగా వుంది. సమయానికి ఒక్కరూ కౌంటర్‌లో వుండరు. అడిగితే కస్సుబుస్సుమంటారు. పోస్టల్ ఉద్యోగులు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్న తీరు నెల్లూరు పౌరులకు అసౌకర్యం కలిగిస్తున్నది. వ్యాపారస్తులు, ఉద్యోగులు, విద్యార్థులు క్యూలో గంటలతరబడి నిల్చొని వచ్చినపని నెరవేరక వాళ్ళ సమయాన్ని వృధాచేసుకుని వెనుదిరిగిపోవలసివస్తోంది. విక్రీత సమయంలోకూడా కార్డులు, కవర్లు, స్టాంపులు సక్రమంగాయివ్వరు. ఇందువల్ల ప్రజలు ఇబ్బందులపాలవుతున్నారు.

పోస్టాఫీసులోపల లెటర్స్ వ్రాసుకునేందుకు వేసివుంచిన కుర్చీలు, బెంచీలు నేషనల్ సేవింగ్స్ ఏజంట్లకే సరిపోతున్నాయి. అందువల్ల మిగతా వారికి చాలా అవస్థగా వుంటూంది. పోస్టల్ అధికారులు శ్రద్ధవహించి, తగిన చర్యలు తీసుకోవాలి.

### రామాయణ ప్రశస్తి

'రామాయణ ప్రశస్తి' సాహిత్య సభ 28 తేది టౌన్‌హాలు రీడింగురూమ్‌లో జరిగింది. డాక్టర్ సూరం శ్రీనివాసులు అధ్యక్షించారు. శ్రీ కె. యస్. రామానుజాచార్యులు రామాయణకాలంలో స్త్రీ స్వాతంత్ర్యం గురించి మాట్లాడారు. శ్రీ దుగ్గిరెడ్డి వెంకటరమణయ్య 'సతీస్మృతి' గ్రంథాన్ని ఈసభలోనే ఆవిష్కరించారు. శ్రీ అగస్త్య రెడ్డి వెంకురెడ్డి వందనాలు చెప్పారు. ★

## శివారెడ్డి పద్యాలు

### విజయదశమి

విజయదశమి అన్నవిషయాన్ని ఏనాడో
మరచిపోయిన కవిని మధ్యలోనె
ఏడబట్నపూజ తెలిపెను పండుగ
పూరపూర గొప్పవుత్సవాలు!

పూజపత్రికెక్కె పూజిస్తె, కర్పూర
హారతిస్తె కాలకాలం నీకు,
వచ్చె విజయదశమివరకు నే జీవించి
వుంటె, యముడు నన్ను వుండనిస్తె!

### పుత్తేటి సుబ్రహ్మణ్యాచారి

పుత్తేటి సుబ్రహ్మణ్యము
అర్థరు పన్నిరుచూపె ఆయనరచనల్
ఉత్తముడన్నిట మృత్యువు
యెత్తుకపొయ్యింది దాని కెదురేముంది!

## సంజీవని

### ముహూర్తములు

29 తేది పగలు 12-24 గంటలకు శంకుస్థాపన, వ్యాపార ప్రారంభములకు.

31 తేది రాత్రి 7-48 గంటలకు గృహప్రవేశములకు.

3 తేది ఉదయం 8-31 గంటలకు ఉపనయన, వివాహములు. రాత్రి 7-36 గంటలకు వివాహం.

### వర్షయోగం

ఈ నెల 30, 31 తేదిలలో స్వల్ప వర్షములు. మీనమున కుజ స్తంభన యోగముచే పెద్దవర్షములు లేవు.

### అక్టోబరు తిథులు

29 శని పంచమి రా. 3-45 గం. వ.
30 ఆది షష్ఠి రా. 3-56 గం. వ.
31 సోమ సప్తమి రా. 4-30 గం. వ.

### నవంబరు తిథులు

1 మంగళ అష్టమి రా. 5-50 గం. వ.
2 బుధ నవమి పూర్తి.
3 గురు నవమి ఉ. 7-45 గం. వ.
4 శుక్ర దశమి ఉ. 9-45 గం. వ.

-స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ. ★



కళ్యాణి కంబైన్స్ "ధర్మతేజ" లో కృష్ణంరాజు, రాధిక

# నిర్మాతల విమర్శలకు సెన్సార్ అధికారులు భయపడ్తున్నారా?

ఈమధ్య నెగెటివ్ హీరోల చిత్రాలు ఎక్కువయ్యాయి. పరిస్థితుల ప్రభావం వల్లనో, మరే ప్రోత్సాహంవల్లనో హీరో దొంగగానో, దోషిగానో తయారౌతుంటాడు. చట్టాన్ని చేతిలోకి తీసుకుంటాడు. స్వాతంత్ర్య సమరయోధులను గుర్తుకు తెచ్చేలా అతనిపాత్ర మలచబడుతుంది. ఇట్లా అతనికి ఉత్తమ నాయకత్వ లక్షణాలను ఆపాదించి రూపకల్పన చేయడం పరిపాటై పోయింది. మెషీన్‌గన్లను ధనధన మనిపేల్చేస్తాడు. ప్రేక్షకజనరంజకదృష్ట్యా అతను పోలీసులతో సైతం ధైర్యసాహసాలతో పోరాడి, తప్పించుకొనిపారిపోతాడు. అతని అభిమాన సంఘాలవారిని తృప్తి పరిచే రీతిలో ఎన్నోవిన్యాసాలు చేస్తాడు. ఇవన్నీ దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసమంటూ సమర్థిస్తూ కొన్ని సన్నివేశాలు... ముందు బెంచీ ప్రేక్షకులకు తాత్కాలిక వినోదాన్ని కలిగించేనిమిత్తం ఆ నెగెటివ్ హీరోని విద్యార్థినురాలైన లేడీడాక్టరో, లేడీ లాయరో, పోలీసు అధికారిణో ప్రేమిస్తారు. ఇలా మంచికి, విరుద్ధమైన నేర ప్రవృత్తికి అపసవ్యమైన సమన్వయాన్ని సృష్టించడంవల్ల దాని ప్రభావం యువతరం మీద ఎటువంటి పరిణామాలను చూపిస్తుందని ఎవ్వరూ ఆలోచిస్తున్నట్లులేదు.

**సినిమాలలో శృతిమించుతున్న సెక్స్, హింస**

ఇటీవల సెక్స్, హింస, అవినీతి, ఇవన్నీ ప్రధానాంశాలుగా తయారైన కొన్ని చిత్రాలకు సెన్సార్ వారు ''యు'', ''ఏ'' సర్టిఫికేట్లు ఇస్తున్నారు. ఏవో ఒకటి రెండు చిత్రాలలో తప్ప దాదాపు అన్ని చిత్రాలలోను అశ్లీలం, అర్ధనగ్నదృశ్యాలు తప్పడంలేదు. ఇలాంటివి సకుటుంబంగా చూడదగ్గ చిత్రాలా? ఇటీవల కొందరు దర్శకులు, నిర్మాతలు పత్రికాముఖంగా విమర్శించినందువల్ల హైదరాబాద్‌లోని సెన్సార్ వారు కొన్ని చిత్రాలను చూసీచూడనట్లుగా సర్టిఫికేట్ ఇస్తున్నారేమోనని కొందరు పెద్దలు అభిప్రాయపడటంలో తప్పేమీ లేదనిపిస్తుంది. ★

# స్మిత జాతకమే తారుమారైంది!

''బ్రహ్మ నీ రాత తారుమారు'' అనే చిత్రాన్ని ఏ ముహూర్తంలో సిల్క్‌స్మిత ప్రారంభించిందోగాని ఆమెకంతా తారుమారు అయిపోయింది. ఆ చిత్రానికి ఇంత వరకు బిజినెస్ అవలేదు. బ్రహ్మకు కోపం వచ్చిందేమో అనుకొని, ఆచిత్రం పేరును ''ప్రేమించి చూడు''గా మార్చేసింది. ఇప్పుడామె అదృష్టం ఎట్లావుంటుందో వేచి చూడవలసిందే!

## కొన్ని చిత్రాల పేర్లు

ఎలాంటి టైటిల్స్‌నయినా మన ప్రేక్షకులు భరిస్తారనే విశ్వాసం నిర్మాతలలో ఉన్నట్లుంది. అందుకే కొందరు నిర్మాతలు తమ చిత్రాలకు ఇష్టం వచ్చినట్లు పేర్లు పెట్టేస్తున్నారు.

విజయదశమినాడు మద్రాసులో ప్రారంభోత్సవం జరిగిన ఒక చిత్రం పేరు ''యమపాశం''.

సత్యనారాయణ తాతగా, సుధాకర్ మనుమడుగా నటించే ఒక చిత్రం పేరు

**మద్రాసు సినిమా వార్తలు**

''తాతయ్య పెళ్ళి - మనవడి శోభనం''. శోభనం అంటే ఏమిటని చిన్నపిల్లలెవరైనా అడిగితే ఏమని అర్థం చెబుతారో ఆ కర్మ పెద్దలది!

అలనాటి నటుడు కీ. శే. అమర్‌నాథ్ పుత్రుడైన నటుడు రాజేష్ సమర్పించే ఒక చిత్రంపేరు "ఆ ఆ ఇ ఈ". అ: అతడు. ఆ: ఆమె. ఇ: ఇతడు. ఈ: ఈమె. అని విపులీకరించాడు రాజేష్.

నవ్యచిత్ర అనే సంస్థ "రేపే మన పెళ్ళి" అనే చిత్రాన్ని రూపొందిస్తుందట! బాలకృష్ణ నటించే ఒక సాంఘిక చిత్రం పేరు ''అశోక చక్రవర్తి''.

## ముద్దుల మామయ్య

భార్గవ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ ఎస్. గోపాలరెడ్డి నిర్మించే ప్రతిచిత్రానికి ఆకర్షణీయమైన టైటిల్ పెట్టడం రివాజు. ఈయన ఇప్పుడు సినిమాస్కోప్‌లో నిర్మిస్తున్న చిత్రానికి ''ముద్దుల మామయ్య'' అని నామకరణంచేశారు. బాలకృష్ణ, విజయశాంతి నాయికానాయకులు;

## పి. చంద్రశేఖరరెడ్డి చిత్రాలు

'ఆగస్ట్ ఫస్ట్' అనే హిట్ అయిన మలయాళ చిత్రం ఆధారంగా పద్మాలయా స్టూడియోస్ నిర్మిస్తున్న చిత్రంలో ముఖ్యమంత్రిగా అక్కినేని, పోలీస్ ఆఫీసర్‌గా కృష్ణ నటిస్తున్నారు. ఈ చిత్రానికి జలగం వెంగళరావు, దాసరి నారాయణరావు చేతుల మీదుగా హైదరాబాద్‌లో భారీ ఎత్తున ప్రారంభోత్సవం జరిగింది. నిర్మాత : జి.

—తరువాత 11 పేజీలో

• నిర్యాణము •

సర్వేపల్లి విశ్వనాథంగారు
26-10-88 తేది మంగళవారం మమ్ములనందరినీ
దుఃఖసాగరమున ముంచి స్వర్గస్థులైనారు.
**కుటుంబ సభ్యులు**
2810, రామలింగాపురం, నెల్లూరు-3

## శుభమస్తు

నెల్లూరులో ఆంధ్రమహాసభ మందిరాన 21-10-88 తారీకున ఉషోదయానంతరం, వేలాదిమంది ఆహూతుల సమక్షాన, కుబేరులతోబాటు కుచేలుర సైతం, మాంగల్యధారణసమయాన అక్షింతలు వేసి ఆశీర్వదించగా, చిరంజీవి గుంద్రా మురళీధరరెడ్డి, సౌభాగ్యవతి మంజుల నవదంపతులయిన శుభవేళ వారికిదే మా శుభాకాంక్షల సుమమాలిక.

ఈ వరుడు నేటికి రెండున్నర దశాబ్దాలనాడు పుట్టి కళ్ళుతెరవగనే, ఇతని తండ్రి అకాలంగా కన్నుమూశాడు. చిరుచిరుబాల్యదశలోనే నాన్నగారిని కోల్పోయిన ఈ బాలునికి నీడనిచ్చి, పోషించి, విద్యనభ్యసింపచేసి తమ శక్తిమించి సద్యోభారతదేశాన పైచదువుకుపంపి, తమ కన్నబిడ్డకంటె మిన్నగా పెంచిన ఇతని పినతండ్రి, పినతల్లి త్యాగం, ఆప్యాయత జీవిత రెండవ దశలోకి ప్రవేశిస్తున్న ఇతని అణువణువునా ప్రతిబింబిస్తుంటుంది. ఇంతకాలానికి మన రాజధానీ నగరంలోని ప్రసిద్ధ వాణిజ్య సంస్థ సిద్ధివినాయకలో సముచిత కొలువుకు కుదిరి తన సారధులమెప్పు బహుధాపొందిన ఈ వరునికిదే మా అభినందన పదమాల.

పరాయిళ్ళ నుండి పెరిగి, తిరిగినలోగిలిని, ఉన్నపళాన ఒక్కసారిగా పుట్టింటినివదిలి రావాలంటే పుట్టెడు దుఃఖంరావడం ఏ కన్యకయినా సహజమే. కాలికి మెట్టెలుధరించి మెట్టినిల్లు తొక్కవలసివచ్చిననాడు ఏ వధువు కడుపయినా చెరువుకావడం సర్వసాధారణమే. కళ్ళజోడు వెనకవున్న జంటకళ్ళల్లోంచి నీళ్ళు ఊరడం సర్వసామాన్యమే.

కానీ ఈ లేత ఆలుమగల దాంపత్యంలో కమ్మని 'మురళీ' రవళులు పలకాలనీ, తీయని 'మంజుల' నాదాలు వినిపించాలనీ నాడు పరమపదించిన ఈ వధువు తండ్రి తిరిగి వీరి కడుపున కలగాలనీ మా వాంఛ.

ఇట్లు : శ్రీమతి మోడెంరెడ్డి కృష్ణవేణమ్మ, శ్రీమతి మన్నెముత్తులకోటీశ్వరమ్మ, అశోకవర్ధన, సిద్ధార్థకుమార. రేబాడు, (ఇందుకూరుపేట మండలం)

శ్రీ సిద్దారెడ్డి శ్రీధరరెడ్డి, శ్రీమతి మహేశ్వరమ్మ, బేబీ సంధ్యారాణి, బేబీ వెంకాయ్యరాణి. తూపిలి (వాకాడు మండలం)

స్నేహశీలి, పదుగురి బాగుకై పాటుబడిన

## రావూరు రామచంద్రనాయుడు

నిడిగుంటపాళెం.

19-10-88 తేది హఠాత్తుగా పరమపదించారు
వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ వారి కుటుంబానికి
మా ప్రగాఢ సానుభూతి తెలియచేస్తున్నాము.

**రావూరు పద్మనాభచౌదరి**
మండల కాంగ్రెస్ ప్రెసిడెంటు మరియు కార్యకర్తలు-వెంకటాచలం.
**సి. వి. శేషారెడ్డి, వి. ఆదిమూర్తి**

## పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

రాష్ట్రంలోని పరిస్థితులనుగూర్చి అమాత్రం అవగాహన కూడా లేకుండాపోయింది. రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష సమస్య వ్యక్తులకు సంబంధించిందికాదు; ప్రేక్షని వ తెలుగుదేశాన్ని, రామారావు పీఠాన్ని పెకలించి వేయగల డైనమిక్ వ్యక్తి ఎవరా అన్నదే ప్రశ్న. అది తమకు తాముగా పరిశీలించి నిర్ణయం తీసుకోవలసిన సమస్య; ముఠాతత్వాలతో ముదనష్టంగావున్న స్థానిక నాయకుల అభిప్రాయానుసారం జరగవలసిందికాదు; ప్రాంతాలు, వెనుకబడిన-ముందుబడిన తెగలు తెగుళ్ళ పరిగణనకు సమయంకాదు. నియమింపబడే వ్యక్తి ఇందిరాగాంధీనాటినుండి క్లిష్ట సమయాల్లో ఆమెకు, పార్టీకి విధేయుడుగా, విశ్వాసపాత్రుడుగా వుండినవాడా లేదా అనేదానికి ప్రాధాన్యత ఇస్తే ఇవ్వవచ్చు అంతే!

కాంగ్రెస్‌అగ్రనాయకత్వపు అనిర్ణయ, అనిశ్చితధోరణివల్ల పత్రికలుకూడా పాఠకుల నమ్మకాన్ని పోగొట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. అంతేకాదు; పత్రికలలోవార్తా ప్రాధాన్యతవల్ల వ్యతిరేకశక్తులు అప్రమత్తమై తమకు అపకారం జరుగుతున్నదనేదురభిప్రాయంఅభ్యర్థులలోకలగడానికి ఆస్కారం ఏర్పడుతున్నది. ముఖ్యమైన వార్తలకు సంబంధించి పత్రికలలో వూహాగానాలు జరగడం ఇదేమీ కొత్తకాదు; జరిగే వూహాగానాలన్నీ నిజంకాకుండాపోవడమూ కొత్తకాదు. నాయకుడు స్థిరచిత్తుడైతే, ఎటుఆడిస్తే అటు ఆడనివాడైతే పత్రికలవార్తలు, వూహాగానాలు ఏమిచేస్తాయి? అందువల్ల పత్రికలలోముందుగా వార్త వచ్చినందువల్ల ప్రతికూలమవుతుందని, కలసిరాదని భావించడంకంటే పౌరపాటింకొకటుండదు. అటువంటి గిలులు హృదయదౌర్బల్యంవల్ల ఏర్పడితే ఏర్పడవలసిందేకాని, హేతుబద్ధమైనదికాదు. తమ వూహాగానాలు, వార్తలు తప్పిపోయినపుడు పాఠకుల దృష్టిలో పల్చబడేది, నమ్మకాన్ని పోగొట్టుకునేది పత్రికలేగాని, వార్తలలోని వ్యక్తులుగాదు!

ముందుగా వార్త వచ్చినందువల్ల అసూయపరాయుల్లు అప్రమత్తమవుతారనే దానిని పూర్తిగా త్రోసివేయలేము. పిసిసి అధ్యక్షతనుగూర్చి ఒక తెలుగు దినపత్రికలో ప్రముఖంగా వార్త వచ్చినరోజు నెల్లూరు నుండి కూడా ఢిల్లీకి తంతులు పోయాయట; ఎవరిచ్చారు, ఎవరిప్పించారు అనేచర్చకు సమయమూకాదు, సందర్భమూకాదనుకోండి! అట్లనే హైదరాబాదు నుండి వెలువడే ఆంగ్ల-ఆంధ్ర దినపత్రికల జంట అదిపనిగా ఒకరిమీద విషంకక్కాయి. ఇవి కొత్తగాదు; అనాదిగావుంటున్న అవలక్షణాలే. నాయకులనేవాళ్లు ఇటువంటివాటితో చెత్తబుట్ట నింపడంతప్ప, వాటి వంక కన్నెత్తికూడా చూడరు! పంపినవారికి శ్రమ, ఖర్చు దండగ!!

బుధవారం వరకు పిసిసి అధ్యక్షుని పేరు ప్రకటన జరగలేదు. పత్రిక వెలువడే లోగా ఎవరైంది తెలిసిపోవచ్చు. దేశంలో లేనిసమయంలో రాజీనామా ఆమోదించి వెంగళరావును అవమానించడమేకాదు; రాష్ట్రంలోని కాంగ్రెస్ వాదులను అయోమయస్థితిలో వుంచుతున్నారు ప్రధాని, కాంగ్రెస్ అధ్యక్షుడు అయిన రాజీవ్‌గాంధీ. ఆంధ్రప్రదేశ్‌వంటి బలమైన ప్రాంతీయపార్టీ అధికారంలో వున్న రాష్ట్రంలో అనుసరించవలసిన విధానం కాదిది. పిసిసి అధ్యక్ష నిర్ణయంలోని ఈ జాప్యం కాంగ్రెస్ వాదులలోని వుత్సాహాన్ని చంపివేసింది. ఎన్టీ రామారావు గారికి మరొక టరమ్ అధికారలబ్ధి జన్యమో, ప్రభుత్వంలో కాంగ్రెస్‌ను పునఃప్రతిష్ఠించడమో రాజీవ్‌గాంధీ నిర్ణయం మీద ఆధారపడివుంటుంది!

NSR

## గూడూరు మైకా

(6 వ పేజీ తరువాయి)

పరిశ్రమ దుస్థితికి ప్రతిబింబంగావుండిందా సభ.

సభను వెంకటగిరిరాజా శ్రీ వి.వి.వి.ఆర్. యాచేంద్ర అధ్యక్షించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యఅతిథి. పాతరోజుల కంపెనీ ప్రాశస్త్యాన్ని నెమరువేశారాయన. ఈ సంస్థకు సి. ఆర్. రావు మూలవిరాట్ అయితే, సి. వి. కృష్ణయ్య ఉత్సవ విగ్రహమని చెణుకు విసిరారు. వారిద్దరు రామలక్ష్మణులవంటివారని గోపాలరెడ్డిగారన్నారు. రావూరు, కోట కాలేజీలకు వారిచ్చిన దానాలను ప్రస్తావించి, ప్రశంసించారు.

సి పి ఐ స్థానిక నాయకుడు శ్రీ సి సి సుబ్బయ్య ఈ కంపెనీలో 1936 నుంచి 41 వరకు పనిచేశారట. అందుకాయనను శాలువా కప్పి సత్కరించారు. శ్రీ ఎం. ఆర్. రెడ్డి, శ్రీ జి ఎం నాగభూషణం, శ్రీ బత్తిన రాఘవయ్య, శ్రీ బి. చంద్రశేఖర రెడ్డి తదితరులు మాట్లాడారు. శ్రీ కోడూరు చెన్నయ్య పద్యాలు చదివారు. ఈ సందర్భంగా వెయ్యిమందికి అన్నవస్త్ర దానం జరిగింది.

★

## న్యూస్ పొయిట్రీ

వేపకొమ్మ గోపాలరావు

### టీకప్పులో తుఫాను!

సాహాయ్యా......
అమాత్యశేఖరులు జనారెడ్డి
సమక్షంలో మనుబోలు
టోలుగేటు పాటనూర్చి
గూడూరు గెస్టుహవుసులో
చెలరేగిన టీకప్పులో తుఫాను!

పెద్దరెడ్డిగారి విసుర్లు కసుర్లు
ఇరకాటంలోపడిన అధికార్లు
స్వాహాకథనంపయి పుకార్లు
వాగ్వివాదాల జోర్లు!

ఆసక్తితో వీక్షించి
పరిస్థితిని సమీక్షించి
కలమెత్తిన పాత్రికేయులు
జరిగిందంతా ఆఫ్ ది రికార్డ్
ఇన్ ది ప్రెస్ అనగానే మడిచి
జోబిలోపెట్టి ఊరకుండేను!

### అప్పడాలు

నెల్లూరు
......విలాస్ హోటల్లో
పెరుగుతో భోజనం
ధర అబ్బ! ఎంతజాస్తి
ఆగష్టు ఒకటినుండి
అప్పడాలెయ్యటం నాస్తి
తెలుగు జనతామీల్సు
అవుతున్నది; పూజ్యం
దేశీయులపాలన
అప్రశతుల రాజ్యం!

## ది నెల్లూరు కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లి.,

నం. 2819
17/89 & 40, తిప్పరాజువారివీధి, నెల్లూరు-524 001.

### ప్రకటన

శ్రీ పెరుమందూరు బాబు S/o శ్రీ పెరుమందూరు సుబ్రహ్మణ్యం, అనునతను ఈ బ్యాంకు నందు డైలీడిపాజిటు కలెక్షను ఏజెంటుగా పనిచేస్తూ, 8-10-88 తేది నుండి రాజీనామాచేసినాడు. వీరు వసూలుచేస్తూవుండిన ఖాతాల నన్నిటిని డిపాజిటర్లకు తిరుగా పూర్తిగా చెల్లింపబడినవి. వీరు 8-10-88 తేది నుండి డిపాజిటర్లతో ఆర్థికపరమైన లావాదేవీలు జరిపియున్న అటువంటి లావాదేవీలకు బ్యాంకు బాధ్యత వహించదని తెలియపరచడమైనది.

యణా. వెంకటేశ్వర్లు — కార్యదర్శి.
జె. సి. యస్. అమర్‌నాథ్ — అధ్యక్షుడు.

# ఫార్ములా కథల మూసలో ముంచి తీసిన చిత్రం

# ముగ్గురు కొడుకులు

తెలుగులో పకడ్బందీగా తయారై ఒకటి వెంట ఒకటి విడుదలవుతున్న వ్యాపారాత్మక చిత్రాలను సమీక్షించటం వ్రాసించే ప్రాయాసమవుతూవుంది. దీనికి కారణం ప్రతి చిత్రంలోనూ చూపించే చూపటం, అన్ని సినిమాలు ఒకే రకంగా వుండటం. ఒకే రకం ఫైట్సు, ఒకే రకం డాన్సులు, డ్యూయట్లు, ఒకే రకమైన పాత్రలు, ఒకే రకమైన దుస్తులు, ఒకే రకమైన కథావస్తువు.

వ్యాపారాత్మక చిత్రం అనగానే పది ఫైట్సు, పది డాన్సులు, పది డ్యూయట్లు, ప్రతిపాటలో ప్రతిచరణానికి హీరో హీరోయిన్ల డ్రస్సులు విచిత్రంగా మారిపోతూ వుండేదే చిత్రం విజయం సాధిస్తుందన్న సిద్ధాంతం ఏర్పడింది. దీనికి ప్రేక్షకుల దారిద్ర్యమే కారణమైంది. చిత్రంలోని మిగతా విషయాలన్నీ ఎలా వున్నాసరే హీరో చేస్తున్న ఫైట్సులోను, డాన్సుల్లోను ముఖ్యంగా యువప్రేక్షకులు తెరమీది తమ అభిమాన హీరోతో తమని తాము పోల్చుకుంటూ గొప్ప థ్రిల్ అనుభవించేస్తున్నారు. విరగబడి చిత్రాలు చూస్తున్నారు. వీరు చూస్తున్నారని నిర్మాతలు తీస్తున్నారు. ఈ మేరకు ఈ ఉభయ వర్గాల మధ్య ఒక ఒడంబడిక వారికి తెలియకుండానే ఏర్పడిపోయింది. ఈ పరిస్థితుల్లో మార్పు అన్నది ఎలా ఆశించగలం? ఈ విషయాన్ని పనిగట్టుకొని కొత్తగా చెప్పనక్కరలేదు. కాని హీరో కృష్ణ దర్శకత్వంలో తయారైన "ముగ్గురు కొడుకులు" చిత్రం చూసిన తర్వాత ఈ విషయం చెప్పక తప్పని పరిస్థితి ఏర్పడింది.

మామూలుగానే ఈ చిత్రంలోనూ స్మగ్లింగ్ సమస్యను ఎన్నుకున్నారు. ఇక స్మగ్లింగ్ అన్న తర్వాత దానికి ఒక బడా నాయకుడు, అతనికి దండిగా ముఠా వుండి తీరాల్సిందే. స్మగ్లింగు గుట్టురట్టు చేసి ఆనాయకుడ్ని అతని ముఠాను పట్టిచ్చేందుకు ఒక హీరో వుండాలి. ఇవన్నీ ఈ చిత్రంలో సరా మామూలుగా వున్నాయి. ఇందులో ముగ్గురు కొడుకులున్నారు కాబట్టి ముగ్గురూ మూకుమ్మడిగా హీరోలుగా మారి ఆ ముఠా పీకకి మక్కుకుని హతమారుస్తారు.

ఈ మామూలు స్మగ్లింగు వ్యవహారానికి ఒక చిన్న కుటుంబకథ జోడించారు. ధర్మారావు (గుమ్మడి) పోలీసాఫీసరుగా వుంటాడు. పోలీసుద్వారా జోగారావు (సత్యనారాయణ) దొంగరవాణా చేస్తున్న లారీని ధర్మారావు పట్టుకుంటాడు. కక్ష సాధింపుచర్యగా లారీ డ్రయివరు హత్యను ధర్మారావుమీదమోపి అతన్ని జైలుపాలు చేస్తాడు జోగారావు. ధర్మారావు ముగ్గురు కొడుకులు, భార్య అనాథలవుతారు.

## చిత్ర సమీక్ష

గిద్దలూరు గోపాలరావు

తుపానుభీభత్సంలో పెద్దకొడుకు ఫణీంద్ర (కృష్ణ) రెండవ కొడుకు రాజేంద్ర (రమేష్ బాబు) తల్లినుంచి తప్పిపోతారు. మూడవ కొడుకు సురేంద్ర (మహేష్) తల్లిదగ్గర నిలిచిపోతాడు. ఫణీంద్ర దొంగలను కొట్టి పేదలకు సహాయపడుతుంటాడు. జోగారావు స్మగ్లింగ్ వ్యాపారంమీద కన్నువేసి వుంటాడు. తన తమ్ముళ్ళుకూడా అదే బస్తీలోవుంటారు. కలుసుకుంటూవుంటారే గాని వారిబంధం వారికి తెలియదు. జైలుకు పోయిన ధర్మారావుగూడా అదే బస్తీకి వస్తారు. మొదటనుంచి వీరి కుటుంబం పూజిస్తున్న నాగుపాముద్వారా ఎవరు ఎవరైందీ తెలుసుకుని చివరన అందరూ ఒకటవుతారు.

ముగ్గురు కొడుకులుగా కృష్ణ అతని కుమారులు రమేష్, మహేష్ నటించారు. జనానికి ఇదొక ప్రత్యేక ఆకర్షణ. ఒక నాగుపామును, ఒకకోతిని నటింపచెయ్యటం ఇందులో ఇంకో ఆకర్షణ.

చిత్రంలో చెప్పుకోతగ్గవి రెండు సన్నివేశాలున్నాయి. చిత్రం ప్రారంభంలో చిన్నప్రాయంలోని ముగ్గురు కొడుకుల పుట్టినరోజు పండుగ జరిపిన విధానం, "సంసారమే బృందావనం"-అని అందరూ కలిసి పాడుకోవటం, ఆ సంతోషసమయంలో తండ్రి ధర్మారావు హత్యానేరం క్రింద అరెస్టుకావటం, తర్వాత తుపాన్లో ముగ్గురుకొడుకులువిడిపోవటం పటుత్వంగా వుంది. అలాగే చివరన ముగ్గురుకొడుకులు అదేపుట్టినరోజు అదేపాటద్వారా కలుసుకోవటం గంభీరంగావుంది. ఇవిమినహా మిగతా చిత్రమంతా మామూలు తెలుగు సినిమా మసాలాలతో మగ్గిపోయింది.

కృష్ణ, సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, గిరిబాబు, రమేష్, మహేష్, రాధ, అన్నపూర్ణ వగైరా పెద్దనటీనటులున్నారు. కాని వారి వుపయోగం పెద్దగా కనిపించ లేదు. కృష్ణ, రమేష్, మహేష్‌లు ఒళ్ళు విరుచుకొని చేసిన ఫైట్సు సాహసోపేతంగా జనం స్వీకరిస్తారు.

కృష్ణ దర్శకత్వం వహించడమేకాక స్క్రీన్‌ప్లే, ఎడిటింగ్ శాఖలనుగూడా నిర్వహించారు. ఈ నిర్వహణలో ఆ శాఖలకు ఒరిగింది ఏమీలేదు. ఆయనపేరు పెరిగిందీలేదు.

పరుచూరి బ్రదర్స్ మాటలు నీరసంగా వున్నాయి. వేటూరి "సంసారమే బృందావనం" పాట, దానికి చక్రవర్తి సంగీతం కమ్మగావుంది. ★

## జాషువా

(4 వ పేజీ కొరవ)

మలినిట్టూర్పు అని రెండు భాగాలుగా వ్రాశారు.

నేతాజీ తరువాత జాషువా మనస్సును కలచిన సంఘటన మహాత్ముని నిర్యాణం.

గుర్రాలకు రెక్కలుగల
వెర్రియుగాల్ దాటిపోయె విజ్ఞానంబుల్
బుర్రగల గాంధియుగమిది
కర్రలు ఖడ్గంబులు ఏలగావు ప్రజల్

అంటాడు.

గాంధీజీ వెళ్ళిపోయిన తరువాత మన దేశంలో సాంఘికంగా, ఆధ్యాత్మికంగా, సాంస్కృతికంగా, సాహిత్యపరంగా కుల తత్వం ప్రేరేగిపోయింది. ఈవిషయాన్నే జాషువా ఆవేదనతో వ్యక్తంచేశారు.

కలకలనవ్వెదు రాతి
శిలయై కలయై యనంత శిల్పంబునకున్
బలమిచ్చి మాయమయ్యెను
కులమత తత్వంబులు
పుంజుకొని తలయెత్తెన్.

ఆయన ప్రబోధం ఒక కులప్రేరణకో, మతోన్మాదానికో, వర్ణోన్నతికో, ప్రాంతీయ భావనకో అంకితంకాలేదు. ఆయనకు గం సంస్కరణాభిలాష ప్రగాఢమైనది. సంస్కరణకు రచనను ఒక సాధనంగా ఆయన తీసికొన్నాడు. అందుకే-

"వర్ణభేదంపు తీర నటించెదర
కటికచీకటి నా పెద వెర్రి
నమ్మకాలూడని జాతి హస్తమున
నూనెద కారకకాంతారముల్"

అని అనినాడు.

ఇట్టి ప్రయత్నంతో ముందుకు సాగిన ఇతనికి "సమకాలీనులు మెచ్చరెచ్చటన్" అని చెప్పిన మహాకవి మాటలు అక్షర సత్యాలై ప్రోత్సాహం లభించలేదు. కులం తక్కువవాడని, పంచముడని కించపరచారు. కులవ్యవస్థకు వ్యతిరేకించిన మనస్కుడైనాడు.

గవ్వకుసాటిరాని పలుగాకుల
మూక లసూయచేత న
న్నెవ్విధి దూషించిన నసువరించిన
కారద లేచిపోవునే
యువ్వసుధాస్థలిన్ పొడమ
రసాబ్దుల గంటమునేదన్
తవ్వులరాల్చెదన్ గరగరల్
పచరించెద నాంధ్రవాణికిన్.

అని తవ్వలనే రాల్చారు. ఈ మాటలవెనక దానికి ముందు ఆయనమనస్సెంత వ్యథకు గురి అయిందో క్రిందిపద్యం చూస్తే తెలుస్తుంది.

నా కవితావధూటి వదనంబు
నెగాదిగజూచి రూపురే
ఖ కమనీయవైఖరుల గాంచి
భళీభళీ యన్నవాడే మీ
దేకులమన్న ప్రశ్న వెలయించి
చివుక్కున లేచిపోవుచో
బాకున గ్రుమ్మినట్లగును
పార్థివచంద్ర వచింప సిగ్గగున్.

ఆయన కవిత్వం గుండె బుగ్గనుంచి బయలుదేరిన అమృతధార. అది చదివిన వెంటనే చదువరుల గుండెకు హత్తుకొనిపోతుంది. ఖండకావ్యాలు ఫిరదౌసి, గబ్బిలం, ముంతాజ్‌మహల్ ఆయన కలంనుండి రాలిన విస్ఫులింగాలు.

—(కొరవ పైవారం)

## సినిమా

(9వ పేజీ కొరవ)

హనుమంతరావు, నిర్వహణ: జి.ఆదిశేషగిరి రావు.

ఎవర్‌గ్రీన్ ఇంటర్నేషనల్ వారు పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో రెండు హిందీ చిత్రాలు తీస్తున్నారు. "ఈ తీర్పు ఇల్లాలిదే" ఆధారంగా ఆర్. కుమార్, సి. హెచ్. వరలక్ష్మి నిర్మించే "కానూన్ కీ ఆవాజ్" చిత్రంలో జయప్రద, శత్రుఘ్నసిన్హా, ప్రేమ్‌చోప్రా, శేఖర్ సుమన్, అస్రాని, అరుణాఇరాని, కొత్తనటి మేనక, కుయిలీ, లీనాదాస్, మాస్టర్ ప్రసాద్ నటిస్తున్నారు. నవంబరు 18న విడుదల.

### చలాకీ మొగుడు-చాదస్తపు పెళ్ళాం

నటి జి. నిర్మల అల్లుడు ప్రసాద్‌తో పాటు జగన్ అనే యువకుడు కలిసి నిర్మలాఆర్ట్స్ బానర్‌లో "చలాకీమొగుడు-చాదస్తపు పెళ్ళాం" అనే చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఇందులో రాజేంద్రప్రసాద్ మొగుడు. రజని పెళ్ళాం. దర్శకత్వం: రేలంగి నరసింహారావు.

### "సోగ్గాడి కాపురం"

సి. శ్రీధర్‌రెడ్డి, కె. వెంకటేశ్వర్లు నిర్మిస్తున్న ఆర్. ఆర్ట్స్ మూవీస్ చిత్రం. శోభన్‌బాబు, జయసుధ, రాధ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, రాజేష్, వై. విజయ, లాతినేని రాజేశ్వరి, కె.విజయ పాత్రధారులు. మాటలు: సత్యమూర్తి. పాటలు: సి. నారాయణరెడ్డి, వేటూరి. సంగీతం: చక్రవర్తి. ఈ చిత్రం నవంబర్‌లో విడుదలవుతుంది. దర్శకత్వం: కోడి రామకృష్ణ. ★

## వేపపిండి

(4వ పేజీ కొరవ)

వృధాకాదు వరిమొక్కలు నత్రజనిని ఎక్కువగా పిలకలువేసే దశలోనూ, చిరుపొట్టదశలోనూ వుపయోగించుకొంటాయి. కాబట్టి వేపపిండిని కలిపిన యూరియాను ఈ దశల్లో వరిపైరుకు వాడితే నత్రజని సామర్థ్యం 20 నుంచి 25 శాతం ఎక్కువై ఎకరాకు షుమారు 200 కిలోల పంట దిగుబడిని పెంచుకోవచ్చు. మాచెక్కిసిన వేప చెక్కకన్నా వేపగింజల్ని ఎండబెట్టి పొడి చేసి వాడితే మంచిది.

